# రామ్, శ్యామ్
## అడవి మనుషులతో అనుభవం

PARLE



















POPPINS







పార్లే పాపిన్స్

నోరూరించే, మనసుదోచే, మైమరపించే.

everest/86/PP/411-tl

# పాపాయికి కేవలం ప్రేమే చాలదు గనక కావాలి...

## యూనిట్ ట్రస్ట్ వారి బాలల కానుక వృద్ధి నిధి.

నేడు, మీ చిన్నారి పాపాయికి కావాల్సింది ఎనలేని ప్రేమ. అయితే కేవలం ఆ ప్రేమతోనే తీరతాయా మరి జీవితమంతా మీ పాపాయి ముచ్చట్లు?
మీ పాపాయి పెరిగే వరకి ఎన్నెన్నో కావాల్సివుంటాయి. వాటిలో కొన్నిటిని మీరివ్వాలను కుంటారు. మాట వరసకి... మంచి చదువు, మంచి వ్యాపారానికి మదుపు. అయితే వీటన్నిటికీ జాగ్రత్తగా పథకంవేయడం అవసరం. ఆ మీ పథకాలలో తోడ్పడేందుకు యూనిట్ ట్రస్ట్‌వారి వద్ద సాటిలేని పొదుపు పథకం వుంది. అదే బాలల కానుక వృద్ధి నిధి. ఈ పథకం క్రింద మీరు మీ పాపాయికి తిరుగులేని ఓ కానుక నివ్వవచ్చు.
మీ పెట్టుబడి మీ పాపాయితో పాటు పెరుగుతుంది. ఉదాహరణకి మీ పాపాయి పుట్టగానే మీరుగానీ రూ. 1000/- పెట్టుబడి పెడితే ఆ మొత్తం రూ. 12,000 కంటెఎక్కువ అవుతుంది 21 ఏళ్ళలో.
లేదా మీరు ప్రతి సంవత్సరం కొంత మొత్తం అనుకుని పెట్టుబడి పెట్టవచ్చు.
ఒకవేళ మీరుగానీ మీ పాపాయి ప్రతి పుట్టిన రోజుకి రూ. 1,100/- చొప్పున మీ పాపాయికి 15వ ఏడు వచ్చే వరకు పెట్టుబడి పెడితే 21వ ఏడు వచ్చేసరికి మీ పాపాయిని లక్షాధిపతిని చేస్తుంది ఆ పెట్టుబడి.
దాంతో మీ పాపాయి పెరిగి ప్రపంచంలో ముందడుగు వేసేనాటికి చెప్పుకోదగ్గ మొత్తం పోగయి చేతికందుతుంది.
మీరిచ్చేకానుక.
మీ పాపాయి రేపటినీ, జీవితమంతా సమకూర్చే వాటినీ ఆశాజనకంగా మార్చుకునేందుకు తోడ్పడేందుకు.
అదే మరి ప్రేమకానుక. కాదా మరి?







**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**
(ప్రభుత్వరంగంలో ఒక ఆర్థిక సంస్థ)

Sista's-UTI-637/88 TEL A

# PARRY



## స్నేహితులారా,

మళ్ళీ మనం కలుసుకుంటున్నాము. నా చిన్నారి మిత్రులు క్రీమీ, కోకోనట్ క్రీమ్ మరియు లాలీపాప్ ఈనెల మీకు మరింత వినోదం తీసుకు వచ్చారు. అది ఒక డిటెక్టివ్ ట్రిక్. ఆడేబొమ్మ తయారుచేయుడం. ఆశ్చర్యపరిచే వింత విషయాలు! ఇక చదవవలసిన అవసరం లేదు. ముందుకు సాగండి.




THE KING OF SWEETS

## రండి, మనం ఆడే బొమ్మని తయారు చేద్దాం!



FIG. 1

రెండు ప్లేట్లని కలిపిస్టేపిల్ చేయండి, లేకటేప్‌తో అతికించండి (చిత్రం 1 లో చూపించినట్లు).కానీ మీచేయి లోపలకి సులభంగా వెళ్ళడానికి ఖాళీ ఉండాలి. అయితే ఈఖాళీ క్రింది భాగంలో ఉండాలి.ఇప్పుడు ఒక ప్రక్క ఏదో మొఖము చిత్రించండి (చిత్రం 2లో చూపించినట్లు). అల్లిక ఊలు లేకనూలు ఊలుని జుట్టుగా ఫెవీకాల్‌తో అంటించండి. ఇక మీ ఆడేబొమ్మ తయారయినట్లే. ఇప్పుడు మీరు చేయవలసినది, ఖాళీస్థలం లోంచి మీచేయి దూర్చి ఆడేబొమ్మని ఆడిస్తూ ఆ బొమ్మ గొంతుతో మాట్లాడడమే. మీ స్నేహితులందరితోనూ కలసి ఆడేబొమ్మలాట ప్రదర్శనని ఏర్పాటు చేయవచ్చు. మీకు కావలసినన్ని బొమ్మలు తయారుచేయండి. రకరకాల ముఖాలు వాటికే



పెట్టండి. ఒక కథ అల్లండి. మీ నాటకంలో వాటిని పాత్రలుగా ఉంచండి. మీరూ, మీ స్నేహితులు నటించడం ప్రారంభించండి - (మీ చేతులతో) వాటి తరపున సంభాషణలు చెప్పండి.




మీకు కావలసినవి:
రెండు పేపర్‌ప్లేట్లు.
స్టేప్లర్ లేదా సెల్ టేప్.
పాత అల్లిక ఊలు కొంచెం లేదా కొంచెం నూలు ఊలు.
జిగురు (ఫెవికాల్ అయితే మంచిది) రంగులు, లేదా స్కెచ్ పెన్నులు లేదా క్రేయాన్స్




FIG. 2




## మీకు తెలుసా?

ఈగలు, సీతాకోక చిలుకలు వాటి పాదాలతో రుచి చూడగలవని మీకు తెలుసా?



ప్యారీస్ మిఠాయిలు మరియు






# S PAGE

నేను మీతో ఒక రహస్యం పంచుకోబోతున్నాను.

# రహస్యపు రాత!



మీకు కావలసినవి: పరిశుభ్రమైన పాళీవున్న ఫౌంటెన్‌పెన్. తాజా నిమ్మకాయ ముక్క, ఒక కప్పు-తెల్ల కాగితం.

ఒక కప్పులోకి నిమ్మరసం పిండి, పిండిన నిమ్మరసంలో ఫౌంటెన్‌పెన్ పాళీ ముంచి దానిని సిరాగా ఉపయోగించి తెల్లకాగితం మీద రాయండి. ల్యాంప్ మొదలైనవాటి మీద టేబుల్ కాగితంపెట్టి వుంచేదాకా మీరు వ్రాసింది అదృశ్యంగానే ఉంటుంది. ల్యాంప్ వేడికి వ్రాసినది ప్రత్యక్షమవుతుంది. ఈ ఆటని నలుగురూ కలసినప్పుడు సరదాగా ఆడుకోవచ్చు. రహస్యాన్ని మీకు, మీ స్నేహితుని మధ్య ఉంచుకోండి. స్నేహితుని మరో గదిలోకి పంపండి. (అక్కడ టేబుల్ ల్యాంప్ తప్పకుండా ఉండాలి). మీరు నిమ్మకాయలు, పెన్ను తెల్లకాగితము సిద్ధంగా ఉంచుకోవలెను (ఇతరులకు కనిపించకూడదు తెలుసా!). ఇప్పుడు మీస్నేహితులని ఏదైనా మాట చెప్పమని, ప్రక్క గదిలో కూర్చున్న మీస్నేహితుడు ఖాళీ తెల్లకాగితం చూసి వారికి ఆమాట చెప్తాడని చెప్పండి. మీరు చేయ వలసినది - నిమ్మసిరాతో తెల్లకాగితం మీద ఆమాట వ్రాయటం (మీరు వ్రాసిన తరువాత తెల్లకాగితాన్ని పరీక్షించుకోమని మీ స్నేహితులకి అందించండి) పిదప మీస్నేహితునికి ఇవ్వండి. అతడు ల్యాంపు మీద కాగితం ఉంచి మాట ఏమిటో చదివి మీ స్నేహితులకు చెప్పి ఆశ్చర్య పరుస్తాడు.




చీమకన్నా బలమైన వారెవరు? మనిషికన్నా చీమ ఎక్కువ బరువు ఎత్తగలదంటె మీరు నమ్ముతారా? అది నిజమే! సాధారణంగా మనిషి తన బరువుకన్నా కొంచెం ఎక్కువగా ఎత్తగలడు. అయితే చీమమటుకు తన బరువుకి 50 రెట్లు ఎక్కువగా ఎత్తగలదు.



## మంచి స్నేహితులుగా వుందామా?

నేనూ, నాచిన్నారి మిత్రులు మీ గురించి ఇంకా తెలుసుకోవాలను కొంటున్నాము. మీపేరు, చిరునామా, వయసు, పుట్టిన తేదీ పేర్కొంటూ మీరు ఒకకార్డు వ్రాయండి. అంతేకాదు ప్యారీస్ పేజీలో మీకు బాగా నచ్చిందేమిటో వ్రాయండి.మీ ప్యారీస్ పేజీకి మేము ఇంకా ప్రత్యేకత తీసుకురావాలని అనిపిస్తే అది వెంటనే తెలియజేయండి.

Write to:
PARRYS THE KING OF SWEETS
P.O. BOX 2040
MADRAS 600 001.




THE KING OF SWEETS

HTA 7096

బిస్కట్లు అందరికీ యిష్టమయినవి




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

---

ఈ నెల బేతాళకథ [" విద్యార్థిత "]కు ఆధారం, వసుంధర రచన. మనదేశం ఇప్పుడు జవహర్‌లాల్ నెహ్రూ శతజయంతి ఉత్సవాలను జరుపుకుంటున్నది. ఈ సందర్భంగా, నెహ్రూ జీవిత చరిత్రను, ఈ సంచిక నుంచి చిత్రకథగా ప్రచురిస్తున్నామని తెలియజేయడానికి సంతోషిస్తున్నాము. ఇది, ఆ మహా వ్యక్తి జీవితవిశేషాలతోపాటు ఇటీవలి మన దేశ చరిత్రను కూడా వివరించగలదు.

## అమరవాణి

విరలా జానన్తి గుణాన్, విరలాః కుర్వన్తి నిర్ధనస్నేహం,
విరలా రణేమ ధీరాః, పరదుఃఖేనాపి దుఃఖితా విరలాః

[ఎదుటివారి మంచిని గుర్తించేవారూ, పేదలతో స్నేహం చేసేవారూ, యుద్ధంలో ధైర్యంగా పోరాడేవారూ, ఇతరుల దుఃఖాన్ని తమ దుఃఖంగా భావించేవారూ చాలా అరుదుగా వుంటారు.]

---

సంపుటి 84 జనవరి '89 సంచిక 1

విడి ప్రతి : 3-00 :: సంవత్సర చందా : 36-00



# చందమామ కబుర్లు



## ఆయువు పెంచిన నిదుర!

సైబీరియా బంగారు గనులలో పనిచేసే కార్మికులకు కొందరికి, ఘనీభవించిన నీటి మధ్య 90 సంవత్సరాలుగా నిదురపోతూన్న "లిమోనిదే" అన్న జంతువు కనిపించింది. ఆ జంతువు కాలేయం దాని బరువులో మూడోవంతు ఉన్నది. మామూలుగా ఈ జంతువు ఆయువు పది సంవత్సరాలే. కాని, సుదీర్ఘమైన నిద్రకారణంగా దాని ఆయువు పెరిగింది. ఆ జంతువును తీసుకెళ్ళి, మామూలు ఉష్ణోగ్రత గల నీళ్ళలో వదలగానే హాయిగా నిద్రలేచింది!

## టాల్‌స్టాయ్ కంఠస్వరం

1908లో అమెరికా విజ్ఞానవేత్త థామస్ ఆల్వా ఎడిసన్ రికార్డు చేసిన లియోటాల్‌స్టాయ్ కంఠస్వరం రికార్డులు ఇటీవల కనుగొనబడ్డాయి. వాటిని రష్యాకు తెప్పించారు. రికార్డు చేయించిన అమెరికా స్టూడియో మేనేజర్ వాల్టర్ మిల్లర్ ఇంట్లో ఇవి కనుగొనబడ్డాయి. అమెరికాలోని ఎడిసన్ సెంటర్‌లో 1914వ సంవత్సరంలో ఏర్పడిన అగ్ని ప్రమాదంలో ఈ రికార్డులు నాశనమైపోయాయని, ఇంతకాలం అనుకున్నారు!





## మనిషి—ఏనుగు

ఇంగ్లాండుకు చెందిన మార్క్‌షాండ్ అనే రచయిత, కోణార్క సూర్యదేవాలయం నుంచి, బీహార్‌లోని సోనేపూర్ వరకు గల దాదాపు 1000 కి. మీ. దూరం ఏనుగుమీదే ప్రయాణం చేశాడు. మనిషికీ, ఏనుగుకూ గల సంబంధమూ, మావటీలు ఏనుగునెలా అదుపులోకి తీసుకునేదీ, మచ్చిక చేసుకునేదీ ప్రత్యక్షంగా చూసి తెలుసుకోవడానికి ఆయన ఈ ఏనుగు ప్రయాణం చేశాడు.

## నిజంగానే అంతటి ప్రాచీనమైనదా?

ఇటలీలోని టురిన్‌చర్చిలో — ఏసుప్రభువును శిలువ చేశాక, ఆయన కాయం మీద కప్పబడిన బట్ట అని విశ్వసింపబడే శాలువా ఉన్నది. దానిమీద నెత్తురు మరకలు ఉన్నాయి. అయితే, ఇటీవల మూడు విశ్వవిద్యాలయాలు జరిపిన పరిశోధనలలో ఈ బట్ట అంతటి ప్రాచీనమైనది కాదనీ, అది 14వ శతాబ్దానికి చెందినదనీ తెలియవచ్చింది!



# డబ్బు - ధర్మం

శృంగేరి గ్రామంలో వుండే ధర్మనందను డనే పండితుడిభార్య తాయారమ్మ పరమ పిసినారి. అయితే, పైసా ఖర్చుకాకుండా ఎంతో పుణ్యం సంపాయించాలనే ఆశ మాత్రం వుండేది.

ఒకనాడు చీపురుకట్టలమ్మే ముసలిది, ఇంటి ముందుగా పోతూంటే, పిలిచి, ఒక పాతచీర దాని ముందు వేసి, "ఎన్ని చీపురుకట్ట లిస్తావు?" అని అడిగింది.

"రెండు," అన్నది ముసలిది.

"ఏమిటీ? ఒక చీర యిస్తూంటే, దానికి రెండు చీపురుకట్ట లిస్తావా? సరిసరి! ఈ చీర ఏ పేదదానికైనా ధర్మం చేస్తే, బోలెడు పుణ్యం వస్తుంది. రూపాయికెన్ని యిస్తావు?" అని అడిగింది తాయారమ్మ.

"నాలుగు," అన్నది ముసలిది.

తాయారమ్మ రూపాయిచ్చి, నాలుగు చీపురుకట్టలు తీసుకున్నది. ముసలిది అక్కణ్ణించి పోతూ చీర భుజాన వేసుకున్నది.

తాయారమ్మ అది చూసి కోపగించుకుని, "డబ్బుకు డబ్బూ, చీరా కూడా తీసుకుపోతున్నావా? ఏం నీ గడుసుతనం!" అన్నది.

ముసలిది చిన్నగా నవ్వి, "అమ్మగారూ, మీరు చాలా ధర్మాత్ములు. పేదదానినైన నాకు చీర యిచ్చి బోలెడు పుణ్యం, డబ్బిచ్చి ఇంటికవసరం అయిన చీపురుకట్టలూ కొనుక్కున్నారు," అన్నది.

తాయారమ్మ ఆశ్చర్యపోతూ, ముసలిదానివంక చూడసాగింది. అక్కడే వున్న ధర్మనందనుడు, "తాయారూ, ఆ ముసలావిడ, నీకెలాంటి గొప్ప ధర్మబోధ చేసిందో గ్రహించావా?" అన్నాడు నవ్వుతూ.

—కోలార్ కృష్ణ అయ్యర్





# గెలిచిన ఓటమి

రామాపురంలో వున్న, మహేశం అనే రైతుయువకుడు స్వతహాగా తెలివైన వాడు, సరదామనిషి. అందమూ, డబ్బూ, తెలివితేటలూ పుష్కలంగా వున్న అతడికి, పిల్లనిస్తామని చాలామంది ముందుకు రాసాగారు. కాని, వాళ్ళనెవర్నీ చేసుకోను గాక చేసుకోనని, మహేశం ఖచ్చితంగా చెప్పేశాడు.

మనవడి ధోరణి నచ్చని మహేశం తాత శివయ్య, అతణ్ణి ఒకనాడు దగ్గరకు పిలిచి, "ఏరా, చూపించిన ప్రతిపిల్లనూ, నాకొద్దు పొమ్మంటే, నీకు పెళ్ళి ఎప్పుడయేట్టూ, మీ అమ్మచేతికి ఆసరా ఎప్పుడు దొరికేట్టూ?" అన్నాడు.

తాత మాటలకు మహేశం నవ్వి, "అమ్మ చేతికింద ఆసరాకోసమా, తాతా, నా పెళ్ళికోసం కలవరిస్తున్నది? ఆ మాట ముందే చెబితే, ఏనాడో ఒక మంచి పనిపిల్ల మెళ్ళో తాళికట్టి, తీసుకొచ్చి వుండేవాణ్ణే!" అన్నాడు.

మనవడి చమత్కారానికి శివయ్య కూడా నవ్వుతూ, "మాటలకేంగాని, చూపిన ప్రతి పిల్లనూ కాదన్నావంటే, చివరకు నాలాగే, మీ నాయనమ్మ లాంటి ఎవర్తెపాలనో పడగలవు," అన్నాడు.

శివయ్య మాటలు విన్న మహేశం నాయనమ్మ, "అవునురా, మహేశం! అరచెయ్యంత యింట్లో, అరవయ్యేరు సుఖాలూ అమర్చిపెట్టగల ఆడది విషం కాదుమరీ!" అంటూ దీర్ఘం తీసింది.

మహేశం నవ్వుతుంటూ, "తెల్లవారి లేస్తే బ్రతుకంతా గడిచేది భార్యతోనే. ఎంత ఇంట్లో పనిచేసేదానికైనా, కాస్తో కూస్తో చురుకుదనమూ, తెలివితేటలూ వుండొద్దా, తాతయ్యా? అలాంటి పిల్ల దొరికిన నాడే పెళ్ళాడతాను," అన్నాడు.

లక్ష్మిగాయత్రి



ఇలా వుండగా, పక్కపల్లెలో వుంటున్న శివయ్య స్నేహితుడు రమణయ్యా అనే మరొక వృద్ధుడు, శివయ్యను చూడడానికి వచ్చాడు. ఇద్దరూ ఏవేవో కబుర్లు చెప్పుకోసాగారు.

ఆసమయంలో, ఇంట్లో చలాకీగా తిరుగుతున్న మహేశాన్ని చూసి రమణయ్య, "నీ మనవడేమిట్రా, శివయ్యా?" అని అడిగాడు.

"అవును, మా సూరయ్య పెద్దకొడుకు మహేశం," అన్నాడు శివయ్య.

"అలాగా! చాలా పెద్దవాడయ్యాడే. పెళ్ళిప్రయత్నాలేమైనా చేస్తున్నారా?" అని అడిగాడు రమణయ్య.

శివయ్య, తన మనవడి ధోరణి గురించి, రమణయ్యకు చెప్పాడు.

"బావుంది. మీవాడు, నా మనవరాలు గౌరమ్మకు సరైన జోడులా వున్నాడు," అన్నాడు రమణయ్య.

"నీ మనవరాలు అంత తెలివైందా?" అని ప్రశ్నించాడు శివయ్య కుతూహలంగా.

"రమణయ్య మనవరాలంటే, ఏమనుకున్నావు? తెలివితేటల్లో నీ మనవడు, దానిముందు తీసికట్టనుకో!" అన్నాడు రమణయ్య గర్వంగా.

స్నేహితుడి మాటలకు శివయ్య రోషపడి, "అయితే, నా మనవడు వచ్చి, ఆ సంగతేదో చూడవలసిందే మరి," అన్నాడు.

మహేశం ఒక్కడూ, రమణయ్యతో కలిసి వెళ్ళేట్టూ, గౌరిని చూసి నచ్చితే పెళ్ళాడేటట్టూ నిర్ణయం అయింది.

ఇద్దరూ బయలుదేరారు. ఇంట్లో అడుగు పెడుతూనే రమణయ్య, ఇంటిల్లిపాదినీ కేకలుపెట్టి పిలిచి, "మా శివయ్య బావ మనవడు!" అంటూ మహేశాన్ని అందరికీ పరిచయం చేశాడు.

తర్వాత మనవరాలు గౌరివైపు చూస్తూ, "గౌరమ్మా, మనవడు గొప్ప తెలివైనవాడని, మా శివయ్య తెగమురిసి

పోతున్నాడు. నా మనవరాలు, నీ మనవడికేమీ తీసిపోదని చెప్పి, కావలసివస్తే వచ్చి చూసుకోమని పందెంకాసి మరీ, మహేశాన్ని ఇక్కడికి తీసుకువచ్చాను,'' అన్నాడు.

తాత మాటల్లో లీలగా ధ్వనిస్తున్న భావం అర్థమై, గౌరి ముఖం ఎర్రబడింది. ఆకర్షణీయంగా చురుకుగా వున్న గౌరి ముఖం చూడగానే—ఫర్వాలేదు. తెలివైన పిల్లే! అన్న భావం కలిగింది మహేశానికి.

మహేశం, గౌరివైపు చూసి చిరునవ్వుతో, ''నాకు చాలా దాహంగా వుందండీ. తోడకుండా, పట్టకుండా మనిషికి అందని ఎత్తులో వుండే తియ్యటినీళ్ళు, మీ ఇంట్లో కాస్త యిప్పిస్తారా ?'' అన్నాడు.

గౌరి చిరునవ్వుతో తలవూపి, ''క్షణంలో తెస్తాను. ఉన్నది ఉన్నట్టే తాగుతారా, మనిషి చేసుకున్నవాటిల్లో తాగుతారా ?'' అని మహేశాన్ని ప్రశ్నించింది.

''ఉన్నది ఉన్నట్టు తాగలేను, లోటాలో తెచ్చిపెట్టండి!'' అన్నాడు మహేశం, గడుసుపిల్లే—అని అనుకుంటూ.

రెండు నిమిషాల్లో గౌరి, లోటా నిండా కొబ్బరినీళ్ళు తీసుకుని వచ్చింది. అందరూ గౌరిని అడిగి, లోటాలో ఏమున్నదో తెలుసుకుని ఆశ్చర్యపోయారు.

''ఇవా, నువ్వడిగిన నీళ్ళు !'' అంటూ రమణయ్య, మహేశాన్ని మెచ్చుకున్నాడు.

మహేశం, రమణయ్యతో, ''సగం చచ్చినదాని కోసం, పూర్తిగా చచ్చేదాని





రమణయ్య, తన మనవరాలి తెలివి తేటలకు ఆనందపడిపోతూ, మహేశాన్ని, "ఇక నీ పరీక్ష అయినట్టేనా?" అని అడిగాడు.

మహేశం, "ఇంకొక్క ప్రశ్న వున్నదండీ!" అని, గౌరితో, "మొదటిదాన్ని సేవిస్తేనే బ్రతుకు గడిచేది. రెండవది లేకపోతే, ఊళ్ళో కలి ఎవరింటికీ రాదు. మూడవదీ, నాలుగవదీ లేకపోతే బ్రతకలేం. ఎక్కువైతే, ఒకదానికొకటి తోడై సర్వనాశనం చేస్తాయి! ఐదోది అనంతం! ఈ ఐదూ ఏమిటో చెప్పండి చూద్దాం?" అన్నాడు.

గౌరి, కనీకనిపించని చిరునవ్వుతో తల వంచుకుని, తెలియదన్నట్టుగా తల అడ్డంగా వూపింది.

మహేశం విజయగర్వంతో, రమణయ్య కేసి చూస్తూ, "నేనూ, మా తాతా గెలిచినట్టేనా! ఏదీ పందెం?" అన్నాడు.

రమణయ్య, ఏం సమాధానం చెప్పాలో తోచక తికమకపడ్డాడు.

అది గమనించిన మహేశం, "ఏమీ వద్దులెండి. మీ గౌరిని, మా ఇంటికి కోడలిగా పంపించెయ్యండి, చాలు," అన్నాడు.

ఆ తర్వాత నెల తిరక్కుండా, గౌరికీ, మహేశానికీ పెళ్ళి జరిగిపోయింది.

వల్ల సుఖంగా బ్రతికేవాళ్ళెవరో, చెప్పమనండి, మీ మనవరాలిని?" అన్నాడు.

అందుకు గౌరి నవ్వుతూ, "అవన్నీ ఏమిటో చెబుతాగాని—ఆ సుఖంగా బతికేవాళ్ళు, మీ ఇంటిక ఎన్నాళ్ళకొకసారి వస్తారు?" అని ప్రశ్నించింది.

వెంటనే మహేశం ముఖం వికారంగా పెట్టి, "ఛీ, వాళ్ళు మా ఇంటికి అసలు రానేరారు!" అన్నాడు.

"రక్షించారు! ఇక వినండి. సగం చచ్చేది, ఎర. దానికోసం వచ్చి పూర్తిగా చచ్చేది, చేప. ఆ చచ్చిన చేపలను అమ్ముకుని సుఖంగా బ్రతికేవాళ్ళు, బెస్త వాళ్ళు!" అని జవాబిచ్చింది గౌరి.

అత్తవారింటికి వచ్చాక, ఒక రోజు గౌరి, భర్తతో, "మీకొకసంగతిచెప్పాలి!" అన్నది.

''ఏమిటో చెప్పు,'' అన్నాడు మహేశం.

''పెళ్ళికిముందు నన్ను ప్రశ్నించారే, అదీ!'' అంటూ గౌరి చిన్నగా నవ్వి, ''మీరు ప్రశ్నించిన ఐదూ, పృధివ్యప్తేజోవాయు రాకాశాలనే, పంచ మహాభూతాలు. మొదటిదైన పృధివి—అంటే భూమిని సేవించి పంటలు పండిస్తేనే బ్రతుకు! రెండవది నీరు. అది లేకపోతే ఊళ్ళో—కలి అంటే చాకలి ఎవరింటికీ రాడు. మూడూ, నాలుగూ—అగ్ని, వాయువు. గాలీ, నిప్పూ లేకపోతే బ్రతకలేం. ఎక్కువైతే ఒకదానికొకటి తోడై సర్వనాశనం చేస్తాయి. ఐదవదయిన ఆకాశం—అనంతం!'' అన్నది గౌరి.

మహేశం అంతా విని తెల్లబోయి, చూస్తూ, ''సమాధానం తెలిసీ, పెళ్ళికి ముందే ఎందుకు చెప్పలేదు?'' అన్నాడు.

అందుకు గౌరి, ''మీరడిగిన మొదటి రెండు ప్రశ్నలకూ, నేను సరైన సమాధానాలివ్వగానే, మీరు ఓడిపోతున్నట్టుగా ముఖం పెట్టారు. ఆఖరి అస్త్రంతోనైనా శత్రువును లొంగదీయాలన్నంత పట్టుదలగా, ఆఖరి ప్రశ్న అడిగారు. అప్పటికే నేను, మీకు నచ్చాననీ, ఇంక మీరడిగే ప్రశ్నలకు జవాబు చెప్పకపోయినా, నన్ను పెళ్ళాడతారనీ, నాకు గట్టి నమ్మకం కలిగింది. అందుకే ఆఖరి ప్రశ్నకు జవాబు చెప్పలేకపోయినట్టు నటించి, విజయం మీకే దక్కేట్టు చేశాను. తమకంటే, తమ భర్తలే గొప్పవాళ్ళు కావాలనికదా, మా ఆడవాళ్ళు కోరుకునేది,'' అన్నది.

భార్య తెలివికీ, గడుసుదనానికీ లోలోపల పొంగిపోతూనే, ''అయితే, ఇంతకూ నేను ఓడిపోయానంటావు!'' అన్నాడు మహేశం.

''ఏమో. గెలిచి ఓడారో, ఓడి గెలిచారో మీకే తెలియాలి!'' అన్నది గౌరి.

మహేశం తృప్తిగా నవ్వుతూ, ''ఓడి గెలిచాను! పరీక్షలో ఓడి, నిన్ను గెలుచుకున్నాను!'' అన్నాడు.





# నేత్రలేపనం

విశ్వనాధుడనే వైద్యుడికి, మంచి హస్తవాసి గలవాడన్న పేరున్నది. ఆయన తన వద్దకొచ్చే రోగుల నుంచి పెద్దగా ఆశించేవాడు కాదు. ఒకనాడాయన ఏదో ఔషధం తయారు చేసేందుకు, అటకపై నుంచి పూర్వీకులనాటి తాళపత్రాలను దించి చూస్తూండగా, 'నేత్రలేపనం' అనే మందు చేసేపద్ధతి, ఆయన్ని బాగా ఆకట్టుకున్నది. ఆ లేపనాన్ని కంటికి రాసుకుంటే, భూమిలో నిక్షిప్తమై వున్న ఏ వస్తువైనా కనబడుతుంది.

విశ్వనాధుడు కుతూహలంకొద్దీ, కావలసిన మూలికలు తెచ్చి, కల్వంలో నూరి నేత్రలేపనం తయారు చేశాడు. తర్వాత ఆదివారం, అమావాస్య కలిసేరోజు చూసుకుని, ఆ లేపనాన్ని కళ్ళకు కాటుకగా పెట్టుకుని, ఊరిబయట పొలాల్లోకి వెళ్ళాడు. ఆయనకు భూమిలోపల వున్నవన్నీ స్పష్టంగా కనబడసాగినై. ఒకచోట పచ్చికబీడులో నిలువులోతున, లంకెల బిందెలు ఆయన దృష్టిని ఆకర్షించాయి.

ఆ లంకెలబిందెలున్న స్థలం, జమీందారు పెద్దిరాయుడిది. శాస్త్రప్రకారం భూమిలో ఆరడుగులలోపు దొరికే ఏ వస్తువైనా భూమి యజమానికే చెందుతుంది. అందువల్ల, జమీందారుకు యీ సంగతి చెప్పాలనుకుని, విశ్వనాధుడు లంకెల బిందెలున్నచోట గుర్తుగా ఒక పుల్లగుచ్చి, ఇంటికేసి బయలుదేరాడు.

ఆ రాత్రి భోజనం ముగించి, మర్నాడు జమీందారును కలుసుకుందామనుకుంటూ విశ్వనాధుడు పడుకున్నాడు. ఒక రాత్రి వేళ మంచం పక్కగా ఏదో అలికిడి అయి, ఆయన కళ్ళు తెరిచిచూశాడు. ఎదురుగా ఒక భూతం గాల్లో కదులుతూ ఆయన కంటబడింది.

వీరేపల్లి జయరాంరెడ్డి

విశ్వనాధుడు కొంచెం భయపడి, అంత లోనే ధైర్యం తెచ్చుకుని భూతాన్ని, "ఎవరు నువ్వు? నాతో ఏం పని?" అని అడిగాడు.



భూతం ఆయనకేసి తీవ్రంగా చూస్తూ, "నేనెవరో తెలియనంత అమాయకుడివా, నువ్వు? అఁ, నేను భూతాన్ని! అందునా పరమ కిరాతకజాతికి చెందిన భూతాన్ని," అన్నది.

"సరే, భూతానివైన నీకు, మనిషినైన నాతో ఏం పని?" అని ప్రశ్నించాడు విశ్వనాధుడు తొణక్కుండా.

ఈసారి భూతం వికవికమంటూ నవ్వి, "నీతో వైద్యశాస్త్రం గురించిన చర్చకో, వాదులాటకో వచ్చాననుకోకు. ఇంతకు ముందు నువ్వు, ఊరి పొలిమేరల్లో వున్న బీడులో, ఒకచోట ఎండుపుల్ల గుచ్చావు. అవునా?" అని అడిగింది.

"అదేం నేరమా? ఏదో తోచక అలా చేశాను," అన్నాడు విశ్వనాధుడు అమాయకంగా ముఖంపెట్టి.

ఆ జవాబుకు భూతం గుడ్లురిమి, "నన్నే మోసగించాలని చూస్తున్నావా? అక్కడ భూమిలో లంకెలబిందెలున్నవని, ఎలాగో తెలుసుకున్నావు. కాని ఒకటి గుర్తుంచుకో! నీకు కనబడిన నిక్షేపం, నేను నా వారసుడి కోసం పాతిపెట్టింది. అది నా మనవడు మాధవుడికి దక్కాలి. మరెవళ్ళయినా దాన్ని తమదిగా చేసుకోవాలని చూశారో, వాళ్ళను సర్వనాశనం చేస్తాను," అంటూ మాయమైంది.

భూతం హెచ్చరికకు విశ్వనాధుడు భయపడలేదు. కాని, ఇప్పుడాయనకొక ధర్మసందేహం కలిగింది. భూతం చెప్పినట్టు, ఒకప్పుడు ఆ భూమి మాధవుడి తాతతండ్రులదే. అయితే, వాడిహయాం వచ్చాక దుబారాతనంవల్ల ఆస్తులన్నీ అమ్మేసి బికారిగా మారాడు. ఆ బీడు జమీందారు స్వాధీనమైంది. దాని యజమానికాక, మాధవుడికి ఆ నిక్షేపం అందజెయ్యాలనడంలో, అంతగా న్యాయం

లేదు. మరి ఇప్పుడేం చేయాలి? అ రాత్రంతా బాగా ఆలోచించి విశ్వనాథుడు ఒక నిర్ణయానికి వచ్చాడు.

మర్నాడు ఉదయం ఆయన, ఒక కుంచెడు తడిపిన ముడిశెనగలూ, శివ లింగం ఒక సంచీలో వేసుకుని, పలుగూ, పారా తీసుకుని బీడులోకి వెళ్ళాడు. అక్కడ లంకెలబిందెలు వున్నచోటుకు దూరంగా మూరెడు గుంట తవ్వి, అందులో శెనగలుపోసి, దాని మీద శివలింగాన్ని పెట్టి, మన్నుతో గుంట పూడ్చి ఇంటికి వచ్చాడు.

ఆ సాయంకాలానికి, శివలింగంలో సగభాగం గుంటలోంచి పైకి వచ్చింది. అది చూసినవాడొకడు, ఆ వార్త ఊళ్లో చెప్పాడు. వెంటనే జనం, బీడులో ఈశ్వ రుడు వెలిశాడంటూ పూజలు చేయ సాగారు.

తన పథకం పారినందుకు, విశ్వ నాథుడు చాలా సంతోషించి, నలుగురు గ్రామపెద్దల్ని తీసుకుని జమీందారు దగ్గరకు వెళ్ళాడు. ఆయన జరిగింది విని, ఎంతో ఆనందపడిపోతూ, ''దేవుడు వెలిసినచోటు, దేవుడిదే అవుతుంది. అక్కడ అలయం కట్టేందుకు, బీడంతా ఈనాంగా యిస్తాను. నా తొలిచందా కూడా తీసుకోండి!'' అని డబ్బుతోపాటు, అప్పటి కప్పుడే ఈనాం పత్రం కూడా రాయించి యిచ్చాడు.

విశ్వనాథుడు, పెద్దల సమక్షాన లంకెల బిందెలు వున్నచోట నుయ్యి తవ్వడానికి మనుషుల్ని పురమాయించాడు. లంకెల బిందెలు బయటపడినై. అందరూ దాన్ని దైవలీలగా భావించారు.

రెండు మూడు నెలల్లో, లంకెల బిందెల్లో దొరికిన ధనంతో, అక్కడ చక్కని శివాలయం నిర్మించబడింది. దూరంగా వున్న చింతచెట్టు పైనున్న భూతం మొదటినుంచీ జరిగినదంతా చూస్తూనే వున్నది. అది వైద్యుడి తెలివి తేటలకు అబ్బురపడుతూ, ఏమీ చేయలేక వూరుకున్నది.






## 2

మరునాడు ధీరసింహుడు రాగానే, సులోచన అతన్ని ఉచితాసనంలో కూర్చోబెట్టి, "ఇక్కడికి ముప్పైయోజనాల దూరంలో పడమటి దిక్కున ఒక నది ప్రవహిస్తున్నది. ఆ నదీజలం ఎప్పుడూ రక్తంలాగా ఉంటుంది. ఆ నది ఎక్కడ పుడుతున్నది? ఆ నదీజలం ఎందుకు రక్తమయంగా ఉన్నది? ఇదే నా రెండవ ప్రశ్న." అన్నది.

ధీరసింహుడు తొమ్మిది రోజులు గడువు తీసుకుని, గుర్రం మీద పడమటి దిక్కుగా పయనమయ్యాడు. అలా వెళ్ళి వెళ్ళి ఒక అరణ్య ప్రాంతం చేరుకున్నాడు. అరణ్య మధ్యంలో అతనికి భయానకమైన నెత్తురు కనిపించింది. అతడు గుర్రం దిగి, నది గట్టు మీద కాలినడకనే వెళ్ళి, సూర్యాస్తమయసమయానికి ఆ నది జన్మస్థానమైన చిన్న కొండ మీద ఉన్న కొలను దగ్గరకు చేరాడు.

కొలను నిండా రక్తం సలసల కాగుతున్నట్టనిపించింది. కొలను మధ్య ఒక వింత చెట్టు; ఆ చెట్టు కొమ్మలకు అసంఖ్యాకమైన స్త్రీ శిరస్సులు వేలాడుతున్నవి! శిరస్సుల నుంచి అప్పుడప్పుడు రక్తం ధారలుధారలుగా కొలనులోకి కారుతున్నది!

ధీరసింహుడు అమితాశ్చర్యంతో ఆ దృశ్యాన్ని చూస్తున్నంతలో చీకటి పడింది.



వెంటనే, కొందరు పరిచారికలు పంచ భక్ష్య పరమాన్నాలు తెచ్చి వారికి వడ్డించారు. ఆ స్త్రీలు, దూరంగా కూర్చుని వున్న ధీరసింహుణ్ణి కూడా విందుకు రమ్మన్నారు. ధీరసింహుడు వెళ్ళి మరొక ఆసనంలో కూర్చుని, విందారగిస్తూ, "మీరెవరు ? ఏమిటీ వింత ?" అని పలుసార్లు ప్రశ్నించాడు.

కాని, ఒక్కరు కూడా అతని ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. భోజనాలయ్యాక, ఆ యువతులందరూ ధీరసింహుడి చుట్టూ చేరి తెల్లవారేవరకూ నృత్యగానాలతో అతనికి ఆనందం కలిగించారు. తెల్లవారగానే, భవనం మాయమయింది; స్త్రీలందరూ తలలుగా మారి, మునుపటిలాగానే, నెత్తుటికొలను మధ్య ఉన్న చెట్టుకొమ్మలకు వేలాడసాగారు!

కాని, మరుక్షణమే ఆ ప్రాంతమంతా వింత వెలుగుతో నిండిపోయింది. చెట్టుకు వేలాడుతున్న తలలు ధీరసింహుణ్ణి చూసి పకపకా నవ్వసాగాయి. ఆ తరవాత, ఒక్కొక్క తలగా కొలనులోకి జారి పడ్డాయి. అన్నీ పడిన తరవాత, కొలనులోని రక్తం మాయమై, ఒక అద్భుత భవనం వెలిసింది. భవనం లోపలి విశాల మండపంలో ఒక రత్నఖచిత సింహాసనం ఏర్పడింది. కొంతసేపటికి, పలువురు చెలికత్తెలు వెంటరాగా, చుక్కలలో చందమామ లాగా ఒక అపురూప సౌందర్యవతి మెల్లగా నడిచి వచ్చి, సింహాసనంలో కూర్చున్నది.

ఈ వింత దృశ్యం యొక్క రహస్యం తెలుసుకోవాలన్న నిశ్చయంతో, ధీరసింహుడు చుట్టుపక్కల కలయజూశాడు. కనుచూపు మేరలో ఎక్కడా నరమానవుడి జాడ కలిపించలేదు. అతడు తిన్నగా పడమటి దిక్కుకేసి నడవసాగాడు. అలా కొంతదూరం వెళ్ళాక ఒక గుహ కనిపించింది. అతడు గుహలోకి తొంగిచూశాడు. ఒక ముని కళ్ళు మూసుకుని కూర్చుని తపస్సు చేసుకుంటున్నాడు. ధీరసింహుడు

గుహలోకి వెళ్ళి, మునికి భక్తితో సాష్టాంగ నమస్కారం చేశాడు.

ముని కళ్ళు తెరిచి పలకరించాక, ధీరసింహుడు, తన వృత్తాంతమూ, తను వచ్చిన పనీ తెలియజెప్పి, "మునివర్యుల కరుణ వున్నట్టయితే, నా పని సులభంగా నెరవేరగలదు," అన్నాడు.

"నాయనా, నీకు కనిపించిన స్త్రీలలో అందరికన్నా అందమైన కన్య సునందిని. ఆమె అగ్నికుంభుడనే ఇంద్రజాలికుడి మేనకోడలు. యుక్తవయసు రాగానే, సునందిని ఒక యువకుణ్ణి వివాహమాడా లనుకున్నది. అగ్నికుంభుడికి, అది ఇష్టం లేక, ఆమెపై ఆగ్రహించి, చెలికత్తెలతో సహా ఆమెను తన మాయతో బంధించాడు. అగ్నికుంభుడు మరణిస్తే తప్ప సునందినికి నెత్తుటి కొలను చెట్టు కొమ్మపై నుంచి విముక్తి లభించదు," అన్నాడు ముని.

"మునీశ్వరా, తమ దయ ఉన్నట్టయితే, నేను ఆ దుర్మార్గుణ్ణి హతమార్చి, సునందినికి విముక్తి గలిగించగలను," అన్నాడు ధీరసింహుడు.

"ధీరసింహా, అగ్నికుంభుణ్ణి హతమార్చగల శక్తిసామర్థ్యాలు నీకున్నవి. అయినా, వాడు పరమక్రూరుడూ, జిత్తులమారీ అయిన మహామాంత్రికుడు. వాడి



మాయాజాలం నీ మీద పని చేయకుండా వుండే విధంగా నీకొక మంత్రం ఉపదేశిస్తాను. త్రికరణశుద్ధిగా, భక్తితో ఆమంత్రం జపించినట్టయితే వాణ్ణి నువ్వు సులభంగా జయించగలవు." అని ముని, ధీరసింహుడి చెవిలో మంత్రం ఉపదేశించాడు.

ధీరసింహుడు మునికి కృతజ్ఞతతో నమస్కరించాడు. ముని ధీరసింహుణ్ణి కళ్ళు మూసుకోమని, తల మీద దండంతో తాకాడు. ధీరసింహుడు కళ్ళు తెరిచి చూసేసరికి, అతడు ఆకాశాన్నంటుతున్న ఒక కొండ పాదతలంలో ఉన్నాడు. కొండంతా పూలతో కప్పబడినట్టు, వింత వింత పూవులు పూచి కళకళలాడుతున్నవి.



ఊడివచ్చి, అతడు మామూలుగా నడవ సాగాడు.

ఆ కొండమీద ఉన్న కోటలో కూర్చుని, అగ్నికుంభుడు తాళపత్ర గ్రంథాలను తెరచిచూసి, ధీరసింహుడు తనకేసి రావడం గ్రహించాడు. ధీరసింహుడు తన కోటలో ప్రవేశించడం అపాయం అని తెలుసుకుని, ఆటంకం కలిగించడానికి అగ్నికుంభుడు ఒక ఉపాయం ఆలోచించాడు. తన మాయాజాలంతో మాయాసునందినిని సృష్టించి, చెలికత్తెలతో సహా ధీరసింహుడి దగ్గరకు పంపాడు.

ముని చెప్పిన అగ్నికుంభుడి కోట ఈ కొండ మీదే వున్నది కాబోలు అనుకుని, ధీరసింహుడు అ కొండకేసి నడిచాడు. మరుక్షణమే పులులూ, సింహాలూ గర్జిస్తూ అతని మీదికి దూకాయి. ధీరసింహుడు ఏమాత్రం భయపడకుండా మునీశ్వరుడు ఉపదేశించిన మంత్రాన్ని మూడుసార్లు జపించాడు. అంతే, ఒక్క జంతువు కూడా కనిపించలేదు.

మరి కొంతదూరం వెళ్ళేసరికి, ధీర సింహుడి పాదాలు నేలకు అంటుకు పోయి, ఊడి రాలేదు. ఇది కూడా ఇంద్ర జాలికుడి పనే అని తలచి, మళ్ళీ ధీర సింహుడు మంత్రం జపించడంతో పాదాలు

మాయాసునందిని మందహాసం చేస్తూ, చెలికత్తెలతో కలిసి ధీరసింహుడికి ఎదురు వెళ్ళింది. ఆమెను చూడగానే ధీరసిం హుడు అమితాశ్చర్యం చెంది, "నెత్తురు కొలను వింతచెట్టుకు వేలాడుతున్న మీరు, ఇంతలో ఇక్కడికి ఎలా రాగలిగారు?" అని అడిగాడు.

"అంతా మా మేనమామ దయ. ఆయన కనికరించి మమ్మల్ని ఆ మాయ నుంచి విడిపించాడు. రా, మాతో కలిసి విందుభోజనం చేద్దువుగాని," అన్నది మాయాసునందిని నవ్వుతూ.

ధీరసింహుడు ఆమె మాటలు నమ్మి, ఆమె వెంట వెళ్ళాడు. మంచి మాటలతో, ఆమె, మత్తుమందు కలిపిన పానీయం

అతనికి అందించింది. ఆ పానీయం తాగగానే ధీరసింహుడు సొమ్మసిల్లి పడిపోయాడు. వెంటనే మాయాసునందిని అతన్ని బంధించి తీసుకుపోయి అగ్నికుంభుడికి అప్పగించింది!

అగ్నికుంభుడు నిప్పులురాలే కళ్ళతో, "ఈ దుర్మార్గుడి కాళ్లు, చేతులు బంధించి, జ్వాలాకూపంలో పడవేయండి," అని భటులను ఆజ్ఞాపించాడు.

ఇంతలో ధీరసింహుడికి స్పృహవచ్చి, మోసం గ్రహించాడు. ఒక్క క్షణం మునీశ్వరుణ్ణి స్మరించి, మంత్రం జపించాడు. ఆ కారణంగా అతడు కణకణమండే భయంకరమైన జ్వాలాకూపంలో పడినప్పటికీ మరణించలేదు. మల్లెల పాన్పు మీది నుంచి వచ్చినట్టు, సురక్షితంగా పైకి లేచి వచ్చాడు.

వెంటనే అతణ్ణి కారాగారంలో బంధించమని ఆజ్ఞాపించాడు అగ్నికుంభుడు. చెరసాలపాలయిన ధీరసింహుడు, ఆరోజు రాత్రి కాపలాభటుడైన కరుణాకరుడితో మంచిగా మాటలు కలిపాడు. ఆ భటుడు కూడా అగ్నికుంభుడి శత్రువనీ, కాలం కలిసిరాక భటుడుగా ఉన్నాడనీ తెలుసుకున్నాడు. సునందిని పెళ్ళాడాలనుకున్నది కూడా కరుణాకరుణ్ణే అని తెలియవచ్చింది. అతడు భటుడితో, "నన్ను చెరసాలనుంచి విడిపించావంటే, అగ్నికుంభుణ్ణి హతమార్చి, సునందినితో నీ వివాహం జరిపిస్తాను," అన్నాడు.





''అది నువ్వనుకున్నంత సులభం కాదు. అగ్నికుంభుడు పరమక్రూరుడు; మహామాంత్రికుడు. ఈ కొండ మీది సురక్షితమైన కోట మాత్రమే వాడి నివాసం కాదు. వాడు తన మాయాశక్తితో కొండకు ముప్పైవేల అడుగుల ఎత్తున ఒక మేఘ మండలం నిర్మించుకుని, తన కేదైనా ఆపద వాటిల్లినప్పుడు, ఆ మేఘమండలం లోకి వెళ్ళిపోతాడు. మానవమాత్రు లెవ్వరూ దాని దరిదాపులను సమీపించ జాలరు,'' అన్నాడు కరుణాకరుడు.

''దుర్మార్గం ఆట్టేకాలం సాగదు. ధర్మం కోసం పోరాడేవాళ్ళకు అపజయం అంటూ రాదు. మొదట నువ్వు, చెరసాలతాళం తీసి నన్ను విడిపించి, వాడి కోటకు దారి చూపావంటే మిగతా జరగవలసింది నేను చూసుకుంటాను,'' అన్నాడు ధీర సింహుడు.

కరుణాకరుడు ధీరసింహుడి మాటలకు సంతోషించి, చెరసాలతాళం తీసి, అతణ్ణి వెంటబెట్టుకుని అగ్నికుంభుడి కోటకేసి బయలుదేరాడు. దారిలో వారికి చాలా చెట్లు కనిపించాయి. ''నిజానికి ఇవన్నీ చెట్లు కావు; అగ్నికుంభుణ్ణి ఎదిరించ వచ్చిన వాళ్ళ నందరినీ, తన మంత్ర శక్తితో వాడిలా చెట్లుగా మార్చివేశాడు!'' అన్నాడు కరుణాకరుడు.

ధీరసింహుడు మునిని స్మరించి, అగ్ని కుంభుడి మాయ నశించి వాళ్ళందరికీ అసలు రూపాలు రావాలని కోరుకుని మంత్రంజపించాడు. మరుక్షణమే అక్కడి చెట్లన్నీ మనుషులుగా మారాయి. వాళ్ళం దరూ అమితోత్సాహంతో, సైనికుల్లా ధీర సింహుడి వెంట బయలుదేరారు!

తన కోటలో కూర్చుని తాళపత్ర గ్రంథాలనుతిరగవేస్తూన్నఅగ్నికుంభుడు, ధీరసింహుడు సైన్యాన్ని సమీకరించుకుని, తన మీదికి రావడం గ్రహించి, తన మాయతో ఆ ప్రాంతమంతా గాఢాంధకారం అలముకునేలా చేశాడు. కొండ అమాంతం కంపించసాగింది. ఆ హఠాత్ పరిణా

మానికి భయభ్రాంతులై, ధీరసింహుడి వెంట నడిచే సైనికులు హాహాకారాలు చేశారు. వెంటనే ధీరసింహుడు మంత్రం జపించగానే కొండ కంపించడం ఆగి పోయింది. చీకటి మటుమాయమయింది.

ఆ తరవాత అగ్నికుంభుడు, తన మాయాశక్తితో, సేనల మధ్య పాములు సృష్టించాడు; మంటలు పుట్టించాడు. కాని, ధీరసింహుడు వాటినంతటినీ తన మంత్రశక్తితో మటుమాయం చేశాడు. ఇక ఏమి చేయడానికీ తోచక, అగ్నికుంభుడు కోట నుంచి అదృశ్యమై, మేఘమండలానికి పారిపోయాడు!

ధీరసింహుడి సేనలు కోటలో ప్రవేశించాయి. కోట లోపల బంగారు భవనాలూ, చక్కటి ఉద్యానవనాలూ కంటబడ్డాయి. నిర్మానుష్యంగా ఉన్నప్పటికీ అక్కడక్కడ తినుబండారాలు కనిపించాయి. ధీరసింహుడి అనుచరులకు ఆకలి వేయడంతో, వాటిని తీసి తిన్నారు. కాని, కొంతసేపటికల్లా వాళ్ళందరూ ఒళ్ళు తిరిగి పడిపోయారు. ధీరసింహుడు దాపుల నున్న కొలనులోని నీళ్ళు తెచ్చి మంత్రించి, ఆ మంత్రజలం వాళ్ళ మీద చిలకరించాడు. మరుక్షణమే వాళ్ళందరూ నిద్ర నుంచి లేచినట్టులేచి నిలబడ్డారు!

కరుణాకరుడు వెంటరాగా, ధీరసింహుడు కోట వెలుపలికి వచ్చి, ఒక బండ మీద కూర్చుని, ఆకాశం కేసి, చూస్తూ, అగ్నికుంభుడి మేఘ మండలం



కూలిపోవాలన్న సంకల్పంతో మంత్రం జపించసాగాడు. కొంతసేపటికి మేఘ మండలం ఫెళఫెళారావంతో విరిగి, వేనవేల ముక్కలుగా నేలకూలింది. అనుచరులతో సహా మాంత్రికుడు అగ్ని కుంభుడు, కిందపడి ప్రాణాలు కోల్పోయాడు!

అందరూ హర్షధ్వానాలు చేశారు.

ఆ తరవాత ధీరసింహుడు, కోటకు కొంతమంది భటులను కాపలా వుంచి, కరుణాకరుణ్ణి వెంటబెట్టుకుని, నెత్తురు కొలను ఉన్నచోటికి బయలుదేరాడు. కాని, అంతలోనే, సునందిని తన చెలికత్తెలతో కలిసి కోటకేసి రావడం వారికి కనిపించింది. మాయావి అయిన అగ్నికుంభుడి మరణంతో, వాడి మాయాశక్తి సైతం పటాపంచలయింది!

సునందిని దగ్గరికి వచ్చిన తరవాత, "ముని ఆశీర్వాదబలంతో, దుర్మార్గుడయిన అగ్నికుంభుణ్ణి హతమార్చాను. ఆ కారణంగానే నీకు నెత్తురుకొలను నుంచి విముక్తి లభించింది. ఇప్పుడు నువ్వు కోరిన కరుణాకరుణ్ణి వివాహమాడి సుఖంగా జీవించు," అన్నాడు ధీరసింహుడు.

సునందిని పరమానందంతో అంగీకరించింది. ధీరసింహుడు, సునందినీ కరుణాకరుల వివాహం ఘనంగా జరిపించాడు. ఆ తరవాత అతడు, తనకు సహాయపడిన ముని సమక్షానికి వెళ్ళి నమస్కరించి, ఆయనవద్ద సెలవు తీసుకుని కౌశాంబీ నగరం చేరుకున్నాడు.

అతడు, సులోచనను దర్శించి, నెత్తుటేరు పుట్టుపూర్వోత్తరాలను వివరంగా తెలియజెప్పాడు. అంతా విన్న సులోచన, "అవును. నువ్వు చెప్పినదంతా నిజమే. మహామాయావి అయిన మాంత్రికుడి మరణంతో ఆనది కూడా మామూలుగా నిర్మల జలంతో ప్రవహిస్తున్నట్టు తెలియవచ్చింది. రేపు వచ్చావంటే, మూడవ ప్రశ్న చెబుతాను," అని ధీరసింహుణ్ణి సాదరంగా సాగనంపింది! —(ఇంకావుంది)





# విద్యార్థత

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, పట్టుదలా, శ్రమలకోర్చగలిగినశక్తి వివేకవంతులూ, జ్ఞానులకేకాదు; మూర్ఖులకు కూడా వుంటుంది. నువ్వు మూర్ఖుడివా లేక జ్ఞానివా అన్న శంక కలుగుతున్నది. ఏది ఏమైనా, జ్ఞానిగా పేరొందిన ఒక స్వార్థపరుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

కోసల రాజధానీనగరం పొలిమేరల్లో, విద్యానందయోగి అనే పండితుడు ఒక గురుకులాశ్రమాన్ని నెలకొల్పాడు. ఆయన బోధనలవల్ల పరమ మూర్ఖులు కూడా మహాజ్ఞానులవుతారన్న ప్రతీతి వచ్చింది.

## బేతాళ కథలు



కోసలరాజుకు ఇద్దరు భార్యలు. పెద్ద భార్య కొడుకు విజయుడు బుద్ధిమంతుడు. పదహారేళ్ళ వయసులోనే సకల శాస్త్ర పారంగతుడయ్యాడు. రెండోభార్య కొడుకు అజయుడు మాత్రం అతి గారాబంవల్ల, ఒక్క విద్య కూడా తిన్నగా నేర్చుకోలేదు.

ఒకరోజున చిన్నరాణి, అజయుడి పరిస్థితి గురించి భర్తకు చెప్పుకుని, "నా గారాబం వాణ్ణి పాడుచేసిందని ఒప్పుకుంటాను. నా తప్పు మన్నించి వాడికి కూడా సకల శాస్త్రాలూ వంటబట్టేలా చేయరండి. విజయుడితో పోల్చి, అంతా వాణ్ణి చిన్నబుచ్చుతూంటే, నాకు అవమానంగా వుంటున్నది," అన్నది.

కోసలరాజు ఇది విని, "చేసుకున్న వారికిచేసుకున్నంత మహాదేవ! అజయుడు శుద్ధ మొద్దు. వాడికి చదువు రాదు. దీనికి నేనేం చేయగలను?" అన్నాడు.

"అజయుడు చాలా తెలివైనవాడు. అతడి దృష్టిని చదువుమీదికి మళ్ళించగల మంచి గురువు లభిస్తే, చదువులో వాడు అన్నను మించిపోగలడు," అన్నది చిన్నరాణి.

రాజు కాసేపాలోచించి, "మన నగరపు పొలిమేరల్లో విద్యానందయోగి గురుకులాశ్రమం వున్నది. ఆయన ఎటువంటివాడికైనా చదువు చెప్పగలడంటారు. అయితే ఆశ్రమనియమాలు కఠోరంగా వుంటాయి. అక్కడ అన్ని జాతులవాళ్ళూ సమంగా చూడబడతారు. రాజు, పేద అన్న భేదం లేకుండా అందరూ ఒకేరకం నియమాలు పాటించి తీరాలి. అందువల్లనే నేను, మన విజయుణ్ణి కూడా అక్కడికి పంపలేదు. నా సంగతికేం? మన నగరంలోని భాగ్యవంతులెవ్వరూ తమ బిడ్డలను, విద్యానందయోగి గురుకులాశ్రమానికి పంపడంలేదు. మన అజయు డక్కడి కఠోర నియమాలకు తట్టుకోగలడా?" అన్నాడు.

ఇందుకు చిన్నరాణి, "తమరు అజయుడితోపాటు, విజయుణ్ణి కూడా

అక్కడికి పంపండి. అన్నను చూసి వాడూ వినయం నేర్చుకుంటాడు. అందువల్ల చదువురాని కారణంగా, తన నొక్కడినే అక్కడికి పంపారని చిన్నబుచ్చుకో నవసరంలేదు," అన్నది.

రాజు అందుకు అంగీకరించి, కొడుకు లిద్దరినీ విద్యానందయోగి ఆశ్రమానికి పంపాడు.

కొద్ది రోజులు గడిచిన తర్వాత, పిల్లల విద్యాభ్యాసం ఎలా జరుగుతున్నదీ చూడాలని రాజు, ఇద్దరు రాణులనూ వెంట బెట్టుకుని గురుకులాశ్రమానికి వెళ్ళాడు. వాళ్ళందరూ ఆశ్చర్యపోయేవిధంగా, అక్కడ అజయుడెంతో ఉత్సాహంగా కనిపించాడు.



"నాయనా, ఇక్కడ నీకెలాగుంది?" అని అడిగాడు రాజు, అజయుణ్ణి ఆప్యాయంగా.

"విద్యానందయోగి, మహాజ్ఞాని. నాకు చదువంటే ఆసక్తి కలిగింది. అందరూ ఏళ్ళతరబడి నేర్చుకుంటున్న శాస్త్రాలను, నేను రోజు కొకటి చొప్పున నేర్చుకున్నాను. రెండు వారాల్లోనే, నేను ముఖ్యమైన శాస్త్రాలన్నీ నేర్చేసుకున్నాను," అన్నాడు అజయుడు ఆనందంగా.

చిన్నరాణి ఎంతో సంబరపడి, "నువ్వేం నేర్చుకున్నావో, ఒక్కొక్క శాస్త్రమే క్లుప్తంగా వివరించు, నాయనా," అన్నది.

"అమ్మా, నీకా శాస్త్రాలన్నీ అంత సులభంగా అర్థం కావు. తీరిక సమయంలో నేను, గురువుగారి వద్ద విన్న ఉపనిషత్కథలు చెబుతాను. ప్రతి కథలోనూ ఎంతో గొప్ప నీతి వున్నది," అంటూ అజయుడు అప్పటికప్పుడు కొన్ని కథలు చెప్పాడు.

ఆ కథలన్నీ మూర్ఖులకు సంబంధించినవి. ప్రపంచంలో తమకు తెలియందిలేదనీ, తెలివితేటలలో తమను మించిన వారు లేరనీ అనుకుని, అహంకరించి భంగపడ్డ మూర్ఖుల కథలవి.

''అన్నయ్య కనిపించడేం? వాడి చదువెలా కొనసాగుతున్నది?'' అని అడిగింది పెద్దరాణి ఆత్రుతగా.

''ఇప్పుడు నేను చెప్పిన కథలను విద్యానందయోగి మాకు వినిపించాడు. కొత్తగా చేరిన విద్యార్థుల కాయన, ఈ కథలు చెప్పడం ఆచారమట. ఈ కథలు వినగానే, అన్నయ్య నిరుత్సాహపడిపోయాడు. తన కేమీ తెలియదనీ, తను నేర్చుకోవలసింది చాలా వున్నదనీ అనుకోసాగాడు. అందుకని అస్తమానూ గ్రంథపారాయణం చేస్తున్నాడు,'' అన్నాడు అజయుడు.

రాజు, ఈ మాటలు విని ఆశ్చర్యపడి, విజయుడి కోసం కబురు పంపాడు. విజయుడు రావడానికి కొంతసేపు పట్టింది. వాడు చాలా దిగులుగా కనిపించడం చూసి రాజు, ''ఏం, నాయనా! యిలా వున్నావేం? మేము వచ్చామని తెలిసి కూడా చూడ్డానికి రాలేదు,'' అన్నాడు.

విజయుడు తండ్రికి నమస్కరించి, ''నేను అంతఃపురంలో వుండి, గురువులు నేర్పినవాటిని నేర్చుకుని, నాకన్నీ తెలుసునని గర్వపడ్డాను. అతిముఖ్యమైన ఎంతో కాలం వృథాచేశాను. నేను నేర్చుకోవలసినదింకా ఎంతో వున్నది. త్వరలోనే రాజ్యభారం నిర్వహించవలసి వున్నది కాబట్టి, వీలైనంత త్వరగా అన్నీ తెలుసుకోవాలనుకుంటున్నాను. అందుకే, నా సమయంలో ఒక్క క్షణం కూడా వృథా చెయ్యడం లేదు,'' అన్నాడు వినయంగా.



ఈలోగా విద్యానందయోగి అక్కడికి వచ్చి, "ప్రభువుల రాకగురించి నాకు కొంత ఆలస్యంగా తెలిసింది. జపంలో వున్నాను. నా ఆలస్యానికి మన్నించండి. నా శిష్యులు తమకేమీ లోటు చేయలేదు గదా!" అన్నాడు.

రాజు, యోగికి నమస్కారం చేసి, ఆయనకు తన కొడుకు లిద్దరి మాటలూ చెప్పి, "నేననుకున్నదానికి భిన్నంగా వున్నాయి, వీళ్ళ మాటలు. వీరి చదువుపై, మీ అభిప్రాయం ఏమిటి?" అని అడిగాడు.

"ప్రభూ, విజయుడిక్కడ రెండు సంవత్సరాలపాటు విద్యాభ్యాసం చేస్తే, సకలశాస్త్రపారంగతుడిగా, నేను యోగ్యతా పత్రం యిస్తాను. అది పొందిన వ్యక్తికి భక్తి, వేదాంత, లోకజ్ఞానాల్లో తిరుగుండదు." అన్నాడు విద్యానందయోగి.

"మరి అజయుడి సంగతేమిటి?" అని అడిగాడు రాజు.

"అజయుడు అసాధారణ ప్రజ్ఞావంతుడు-ఏకసంథాగ్రాహి. విద్యాభ్యాసానికి అతడికి గురువు అవసరం లేదు. అతడికి విద్యాబోధన చేయడానికి, నా తెలివిచాలదు. అతడిని, యీ రోజే మీరు ఇంటికి తీసుకు వెళ్ళవచ్చు." అన్నాడు విద్యానందయోగి.

రాజు, ఆయన్ని ఏదో అడగబోయిన వాడల్లా మౌనం వహించి, అప్పటికప్పుడే అజయుణ్ణి తన వెంట రాజధానికి తీసుకుపోయాడు.



బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఎంతో జ్ఞానిగా నలుగురిచేతా ప్రశంసించ బడే, విద్యానందయోగి స్వార్థపరుడని తెలుస్తున్నదిగదా! అజయుడు ఏక సంథాగ్రాహి, అతడి విద్యాభ్యాసానికి గురువు అవసరం లేదు—అన్న యోగి మాటల వెనక ఏదో మర్మం వుండివుండాలి. తన దగ్గిర అతడు మరి కొంతకాలం విద్య నభ్యసిస్తే, కానున్నరాజైన విజయుణ్ణి మించిపోగలడన్న భయం యోగి కున్న దని, నా అనుమానం. భవిష్యత్తులో రాజగురువుగా మరింత కీర్తిప్రతిష్ఠలు గడించాలన్న యోగి స్వార్థబుద్ధే కదా, అజయుడికి విద్యనేర్ప నిరాకరించడానికి మూలకారణం? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఒక రాజ కుమారుణ్ణి, అతడి తండ్రి ఎదట మూర్ఖుడనడం తగనిపని. అందువల్లనే విద్యానందయోగి ఎంతో మృదువుగా, ఆ సంగతి రాజుకు అర్థమయ్యేలా చెప్పాడు. అజయుడు ఏకసంథాగ్రాహి కావచ్చు; కాని అతడు జన్మతః మూర్ఖుడు. అతడి మూర్ఖత్వం తొలగించాలని యోగి, అతడికి కొన్ని మూర్ఖుల కథలు చెప్పాడు. అవి విన్న అజయుడికి, తను ఆ కథలలో లాంటి మూర్ఖుడినన్న విషయమే స్ఫురించ లేదు. రెండు వారాల్లో తను సకలశాస్త్ర పారంగతుడినయ్యాననుకునే అజయుడు, నిజంగానే శాస్త్రజ్ఞానంలో దిట్ట అయితే, అహంకారంకొద్దీ అందర్నీ బాధించగలడు. అతడు రాజు కొడుకు కావడంవల్ల, అతడి అహంకారం లోకులందరికీ యిబ్బంది కలిగిస్తుంది. ఆ కారణంగా అతడు విద్య నేర్చుకునేందుకు అర్హుడుకాదు! విద్యానందయోగి ఎంతో నిస్వార్థబుద్ధితో, రాజ్య క్షేమం కోరి అజయుడికి విద్యనేర్ప నిరాకరించాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# ఆవులపంపకం

ఒక ఊళ్ళో ధర్మయ్య అనే భాగ్యవంతుడు, చనిపోయేముందు, తనకుమారులైన శివయ్య, నారయ్యలను పిలిచి, ''నేను చనిపోయాక, నా ఆస్తిని మీరిద్దరూ పూచికపుల్లతో సహా, సమంగా పంచుకోవాలి!'' అని చెప్పాడు.

తండ్రి చనిపోగానే కొడుకు లిద్దరూ, మొత్తం ఆస్తిని రెండు వాటాలు చేశారు. అన్నీ సమంగా సరిపోయాయి. కాని, ఆవులు మాత్రం మొత్తం పదమూడవడం వల్ల, ఏం చేయాలో యిద్దరికీ తెలియలేదు.

వీళ్ళ సమస్య గురించి విన్న, పేరిశర్మ అనే పేద బ్రాహ్మణుడు వాళ్ళతో, ''మీ నాన్నగారి పెద్దకర్మకు, గోదానం చేస్తారని ఆశపడ్డాను. నాకు ఒకే ఒక్క ఆవున్నది. అది యిచ్చేపాలు, నా కుటుంబానికి చాలడం లేదు. ఒక్క ఆవును మీరు, నాకు యిస్తే, మీ నాన్నగారి ఆత్మకు శాంతి కలుగుతుంది. నా కుటుంబం సుఖపడుతుంది. మీ ఆవులపంపకమూ సులువుగా తేలిపోతుంది,'' అని సలహా యిచ్చాడు.

''దానాలమీద మాకు నమ్మకం లేదు. నువ్వు కూడా దానాలకాశపడక, కష్టపడి బ్రతుకు,'' అన్నారు అన్నదమ్ములు.

పేరిశర్మ వెంటనే, ''నేను దానాల మీదే ఆశపడి బ్రతికితే, మీవంటివాళ్ళే ఎక్కువగా వున్న యీ ఊళ్ళో పూట గడవడమే కష్టమవుతుంది. నా తెలివితేటలతో తీర్పులు చెబుతూ, అందుకు ప్రతిఫలం తీసుకుంటున్నాను. నేను కోరిన ప్రతిఫలం యిస్తానంటే, మీ ఆవుల పంపకం కూడా తేల్చగలను,'' అన్నాడు.

''ఏం కావాలో చెప్పు?'' అన్నారు శివయ్యా, నారయ్యా.

''ఒక ఆవునిస్తే చాలు,'' అన్నాడు పేరిశర్మ.

శ్రీరామకమల్

''నీకు ఆవునిస్తే, ఎలాగూ లెక్క తేలిపోతుంది. ఇందులో నీ తెలివి ఏముంది?'' అన్నారు శివయ్యా, నారయ్యా.

''మీరు, నాకు ఆవునివ్వకుండానే పంపకం తేలిపోతుంది. అప్పుడే నేను, మిమ్మల్ని ప్రతిఫలం అడుగుతాను, సరేనా?'' అన్నాడు పేరిశర్మ.

శివయ్యా, నారయ్యలకు కుతూహలం పెరిగిపోయింది. పేరిశర్మ ఏం చేస్తాడో ఎంత ఆలోచించినా వాళ్ళకు స్ఫురించక, "సరే, ముందు పంపకం జరిగిపోవాలి. మా యిద్దరికీ ఆవులు సమంగా రావాలి. నీకు ప్రతిఫలంగా ఆవును యిచ్చిం తర్వాత కూడా, మా దగ్గిర ఆవులు సమంగా వుండాలి,'' అన్నారు అన్నదమ్ములు.

''అలాగే! నా ఆవునొకదాన్ని, మీ ఆవులలో కలుపుకోండి. ఇప్పుడు మొత్తం పధ్నాలుగు ఆవులయ్యాయికదా? అంటే, మీకు చెరొక ఏడావులు వస్తాయి. పంపకం తేలిపోయినట్టేగదా?'' అని అడిగాడు పేరిశర్మ.

''చాలా బాగుంది! కాని, నీకొక ఆవును ప్రతిఫలంగా యిచ్చాక, మా పంపకం ఎలా?'' అన్నారు శివయ్య, నారయ్యలు.

''నాకొక ఆవు నిచ్చాక, మీ దగ్గిర వుండేవి పన్నెండావులే కదా? ఇంక పంపకంలో యిబ్బందేముంది?'' అన్నాడు పేరిశర్మ.

''మరి నువ్విచ్చిన, ఆవో?'' అన్నారు అన్నదమ్ములు.

''నేను, మీకు ఆవునివ్వలేదు. పంపకం కోసం నా ఆవును, మీ ఆవుల్లో కలిపాను— అంతే! పంపకం అయిపోయింది కాబట్టి, నా ఆవును నేను తిప్పి తీసుకుంటాను,'' అన్నాడు పేరిశర్మ.

ఆ మాటలకు శివయ్య, నారయ్యలు నవ్వి, పేరిశర్మకు ఒక ఆవును యిచ్చి, ''దీన్ని నీ పంపకానికి ప్రతిఫలంగా యివ్వడం లేదు. నీ మాటకారితనానికీ, తెలివితేటలకూ మాత్రమే,'' అన్నారు.

పేరిశర్మ, వాళ్ళిచ్చిన ఆవును తీసుకుని సంతోషంగా ఇంటికి వెళ్ళిపోయాడు.



# చందమామ అనుబంధం—3

# మన విజ్ఞాన సంపద

## మహనీయులు:



### షాజహాన్

జహంగీర్ కుమారుడు ఖుర్రమ్, షాజహాన్ బిరుద నామంతో, ఐదవ మొగల్ చక్రవర్తిగా ఢిల్లీ సింహాసనం అధిష్ఠించాడు. ఆయన 1592 వ సంవత్సరం జనవరి 5 వ తేదీన జన్మించాడు. 1627 వ సంవత్సరంలో జహంగీరు మరణించాడు. ఆ సమయంలో ఖుర్రమ్ దక్కనులో ఉన్నాడు. జహంగీరు రాణి నూర్జహాన్, చిన్న యువరాజు సింహాసనం అధిష్ఠించాలని ఆశించింది. అయినా ఖుర్రమ్, ఢిల్లీ చేరుకుని తన మామగారైన ఆసఫ్‌ఖాన్ సాయంతో మొగల్ సింహాసనాన్ని అధిష్ఠించగలిగాడు. షాజహాన్ గొప్ప కళాపిపాసి. అద్భుతమైన మయూరసింహాసనం ఆయనే రూపొందించాడు. ఆగ్రాలో జుమామసీదు, ఢిల్లీలోని ఎర్రకోట మొదలైన బ్రహ్మాండమైన భవనాలను నిర్మించాడు. తన రాణి ముంతాజ్ బేగం గోరీపై ఆయన నిర్మించిన తాజ్‌మహల్ ప్రపంచప్రఖ్యాతిగాంచిన అపూర్వ కళాఖండం: 1657 వ సంవత్సరంలో షాజహాన్ వ్యాధిగ్రస్తుడయ్యాడు. ఆయన నలుగురు కుమారులు—దారా, సుజా, ఔరంగజేబు, మురాద్ మధ్య సింహాసనం కోసం అంతర్యుద్ధం ప్రారంభమయింది. ఔరంగజేబు తండ్రిని కారాగారంలో బంధించి, సోదరులను కపటంతో ఓడించి 1658వ సంవత్సరం ఢిల్లీ సింహాసనం అధిష్ఠించాడు. 1666వ సంవత్సరం షాజహాన్ కారాగారంలోనే మరణించాడు:

## ఎవరాయన?

ఒక రాజుకు, తన రాజ్యానికి తగిన వారసుడెవరో తెలుసుకోవాలనిపించింది. ఒకనాడాయన తన కుమారులనూ, అన్నదమ్ముల పిల్లలనూ ఒక దేవాలయ ప్రాంగణంలోకి రమ్మని కబురు చేశాడు. అందరూ అక్కడ గుమిగూడారు. పండితుల సమక్షంలో, రాజపురోహితుడు, రాజు మాటగా వారిని ఇలా ప్రశ్నించాడు:

"ఉదయం ఉత్తమ ఆహారం భుజించి, ఇక్కడికి ఉత్తమ వాహనం మీద వచ్చి, ఇప్పుడు ఉత్తమ ఆసనంలో కూర్చుని ఉన్నవారు మీలో ఎవరో చెప్పగలరా?"

గుర్రం మీద వచ్చామనీ, బంగారు రథంలో వచ్చామనీ, పల్లకీలో వచ్చామని ఒక్కొక్క రాజకుమారుడు ఒక్కొక్క సమాధానం చెప్పాడు.

ఆఖరికి ఒక యువకుడు, "నేను తిన్నది ఉత్తమ ఆహారం; ఎందుకంటే అది మా తల్లి పెట్టిన భోజనం. నేను నా కాళ్ళతో నడిచి వచ్చాను; మనిషికి అదే ఉత్తమ వాహనం. ప్రస్తుతం నేల మీద కూర్చుని ఉన్నాను; అదే ఉత్తమమైన ఆసనం!" అన్నాడు.

ఇలా సమాధానం ఇచ్చిన యువరాజు ఎవరో మీకు తెలుసా? (VIII పేజీ చూడండి)

# విజ్ఞాన వినోదం
## మార్పిడి



**సూచనలు :**

అరడుగుల పొడవు గల దారం తీసుకుని, చిత్రంలో చూపిన విధంగా ఒక కొసను కుర్చీ వెనుక భాగానికీ, రెండవ కొసను మరొక కుర్చీ వెనుక భాగానికీ కట్టండి. ఆ తరవాత, రెండడుగుల పొడవుగల రెండు దారాలు తీసుకుని, అడ్డుదారానికి రెండుచోట్ల, సమాన దూరంలో ముడి వేయండి. వేలాడుతూన్న దారాల కొసలకు, సమానమైన బరువుగల రెండు బరువులు కట్టండి. రెండు బరువులూ నేలకు సమానమైన ఎత్తులో వుండే విధంగా చూసుకోండి. ఇప్పుడు, ఆ బరువులలో ఒక దానిని మాత్రం ఊగించి, ఏం జరుగుతుందో గమనించండి.

**ఏం జరుగుతుంది ? ఎలా జరుగుతుంది ?**

కొద్ది క్షణాలలో రెండవ బరువు కూడా మెల్లగా ఊగడం మొదలవుతుంది. ఆ పైన మొదట ఊగడం ప్రారంభించిన మొదటి బరువు క్రమంగా ఆగిపోతుంది. ఒకటి, రెండు నిమిషాలలో రెండవ బరువు ఊగడం ఆగిపోయి, మొదటి బరువు ఊగడం ఆరంభమవుతుంది. ఇలా చలనశక్తి మార్పిడి కొంతసేపు అటూ ఇటూ సాగి, అఖరికి రెండు బరువులు కూడా నిశ్చలస్థితికి చేరుకుంటాయి.

అడ్డుదారాన్ని పరిశీలించినట్టయితే, ఊగేబరువు కారణంగా అది మెల్లగా కదలడం తెలుస్తుంది. ఇలా కదలడం కారణంగానే, దాని చలనశక్తి రెండవ బరువుమీదికి మార్పిడి జరుగుతుంది. ఆ తరవాత కొంతసేపటికి, మొదటి బరువు ఊగడం ఆగిపోయి, రెండవ బరువు ఊగడం ప్రారంభమవుతుంది. ఆ తరవాత రెండు బరువులూ ఊగుతూ, అడ్డుదారం మీద పరస్పర విరుద్ధమైన ఒత్తిడులను కలుగచేయడంవల్ల, చలనశక్తి మార్పిడి కొంతసేపు కొనసాగి, ఆగిపోతుంది.

దారం పక్కలకు చలించి, చలనాన్ని మరొక బరువుకు తీసుకువెళితే తప్ప, ఈ చలన మార్పిడి జరగదు. దారానికి బదులు మరేదైనా గట్టి కర్రను ఉపయోగించి, దానిని ఏమాత్రం కదలకుండా బిగించి, ఇలా చేసినట్టయితే, చలనశక్తి ఒక బరువు నుంచి మరొక బరువుకు మార్పిడి చెందదు. ఒకసారి ఈ ప్రయోగం చేసి చూడండి, మీకే తెలుస్తుంది!





## రోడ్జ్ బ్రహ్మాండ విగ్రహం

రోడ్జ్ రేవు ముఖద్వారంలో బ్రహ్మాండమైన సూర్య (అపోలో) విగ్రహం ఒకటి ఉండేది. ఛార్స్ అనే గొప్ప శిల్పకారుడు 12 సంవత్సరాలు కృషి చేసి, ఆ కాంస్య విగ్రహాన్ని సృష్టించాడు!

రేవు ముఖద్వారంలో ఆ విగ్రహం ఉండేదనీ, ఆ బ్రహ్మాండమైన విగ్రహం కాళ్ళ మధ్యనుంచే ఓడలు వెళ్ళేవనీ, ఆ విగ్రహంచేతిలో పెద్దజ్యోతి ఉండేదనీ చెబుతారు. క్రీ. పూ. మూడవ శతాబ్దంలో ఏర్పడిన ఒక భూకంపం వల్ల ఆ విగ్రహం ఛిన్నాభిన్నమయింది!

## గొప్ప చారిత్రక ఘట్టాలు



# ట్రాయ్

క్రీ. పూ. 12 వ శతాబ్దంలో గ్రీకులకూ, ట్రోజనులకూ మధ్య సుదీర్ఘమైన యుద్ధం జరిగింది. పదేళ్ళ పాటు సాగిన ఈ యుద్ధంలో ట్రాయ్ పూర్తిగా నాశనమయిపోయింది.

అపురూపసౌందర్యవతి అయిన హెలెన్, స్పార్టానగర రాజు మెనెలాస్‌ను పెళ్ళాడింది. అయినా, పారిస్ యువరాజు ఆమెను చెరపట్టాడు. ఆగ్రహం చెందిన గ్రీకు వీరులందరూ కలిసికట్టుగా, ట్రాయ్ తీరం చేరుకుని, రాజధానీనగరమైన ఇలియన్‌ను ముట్టడించారు. కాని, యుద్ధంలో జయాప



# ముట్టడి

జయాలు ఒకపట్టాన తేలలేదు. చివరికి గ్రీకులు ఒక ఉపాయం ఆలోచించారు: వాళ్ళొక బ్రహ్మాండమైన కొయ్యగుర్రం తయారుచేసి, దానిలోపల కొందరు సైనికులు దాక్కున్నారు. "క్షేమకరమైన స్వదేశప్రయాణం ప్రార్థిస్తూ, అతీనా దేవతకు గ్రీకులు సమర్పించిన కానుక ఇది!" అని ఆ కొయ్యగుర్రం మీద చెక్కించి, దానిని ఇలియన్‌నగర సింహద్వారం వద్ద వుంచి రహస్యంగా దాపులనున్న దీవిలో దాక్కున్నారు!

అయితే, ఈ విషయం తెలియని ట్రోజనులు, నిజంగానే శత్రుసేనలు వెనుతిరిగి పోయాయని భావించి, వాళ్ళు వదిలి వెళ్ళిన కొయ్యగుర్రాన్ని అమితోత్సాహంతో నగరం లోపలికి తీసుకుపోయారు. నాటి రాత్రి విజయోత్సవం జరుపుకోవడానికి ఆయత్తమవుతూన్న సమయంలో, గ్రీకులు వారిని చుట్టుముట్టారు. కొయ్యగుర్రంలో దాగివున్న గ్రీకు సైనికులు ఒక్కుమ్మడిగా వెలుపలికి దూకి, నగరద్వార కవాటాలను తెరిచారు. అందరూ కలిసి ట్రాయ్‌ని ధ్వంసం చేశారు. మెనెలాస్, హెలెన్‌ను దక్కించుకున్నాడు.

ప్రాచీన గ్రీకు మహాకవి హోమర్ ఈ ముట్టడి పుట్టుపూర్వోత్తరాలను 'ఇలియడ్' కావ్యంలో రసవత్తరంగా అభివర్ణించాడు. ఈ కావ్యంలో వర్ణించబడిన యుద్ధం నిజంగానే జరిగినట్టు నమ్ముతారు. జర్మన్ దేశానికి చెందిన హీన్‌రిచ్‌ష్లీమన్ అనే పురాతత్వ పరిశోధనవేత్త — హోమర్ తన కావ్యంలో వివరించిన స్థలాలను వెదికి, ప్రాచీన ఇలియన్ నగరాన్ని కనుగొన్నాడు. ఆ కాలంలో సుసంపన్నమైన నాగరికత వెలిసినట్టు, ఆయన పరిశోధనలు వెల్లడించాయి!

## గత చరిత్రకేసి చూద్దాం



1. రెండు సరస్సుల పేర్లనుంచి, తమ పేర్లను సంతరించుకున్న మన దేశంలోని రెండు నగరాలు ఏవి?
   (ఎ) ఆ రెండు నగరాలలో ప్రాచీనమైనదేది?
   (బి) ఆ సరస్సునూ, నగరాన్నీ నిర్మించినవారెవరు?
   (సి) రెండవ నగరాన్ని ఎవరు ఎప్పుడు నిర్మించారు?
2. మనదేశంలో ఒక రాష్ట్రరాజధానీ నగరం అసలుపేరుకు అర్థం— 'పవిత్ర శాశ్వత నగరం.' ఆ నగరం ఈనాటి పేరేమిటి?
   (ఎ) దాని అసలుపేరుకు మరొక విధంగానూ అర్థం చెప్పవచ్చు. అదేమిటో మీకు తెలుసా?
   (బి) ఎన్ని కొండలమీద ఈ నగరం నిర్మించబడింది.
   (సి) 1947 కు పూర్వం ఈ నగరం రాజధానిగా గల రాష్ట్రం పేరేమిటి?
3. 'కొండమనిషి' అన్నది ఒక కొండజాతి తెగపేరు. ఒక రాష్ట్రానికి కూడా ఆ పేరే పెట్టారు. ఆ రాష్ట్రం ఏది?
4. 17 వ శతాబ్దంలో ఢిల్లీకి మరొక తాత్కాలిక నామం ఉండేది. అదేమిటో మీకు తెలుసా?
5. 1989 లో 350 సంవత్సరాలు పూర్తి చేసుకుంటూన్న మన దేశంలోని నగరం ఏది?

(VIII పేజీ చూడండి)

## పరిశోధనలు, అన్వేషణలు ఇతర విశేషాలు

1. అట్లాంటిస్ అంటే ఏమిటి? దానిని గురించి ఎవరు చెప్పారు?
2. ఎల్‌డొరడో ఎక్కడ ఉన్నది?
   (ఎ) ఆ మాటకు అర్థం ఏమిటి?
   (బి) ఆ పేరు ఎలా ప్రచారంలోకి వచ్చింది?
3. పాలిథీన్ ఎప్పుడు ఎక్కడ తయారుచేయబడింది?
4. టేబిల్‌టెన్నిస్‌ను ఎవరు ఎప్పుడు కనిపెట్టారు?
5. నల్లనాలుక గల కుక్క ఉన్నదా?
6. వజ్రం, ఆమ్లంలో కరుగుతుందా?
7. వజ్రాన్ని ఏది హరిస్తుంది?
8. జలమయమై ఉన్న భూభాగం ఎంత?

(VIII పేజీ చూడండి)




1. భారతీయ సంప్రదాయం ప్రకారం వాక్చాతుర్యంలో ప్రసిద్ధులైన ముగ్గురు వ్యక్తులెవరు?
   (ఎ) వారు ఏఏ ప్రాంతాలకు చెందినవారు?
   (బి) వారిని పోషించిన వారెవ్వరు?
   (సి) వారిలో రాజకుటుంబానికి చెందిన వ్యక్తి ఎవరు?

2. దక్షిణ భారతదేశంలో వేదంలా కీర్తించబడే నీతి గ్రంథం ఏది?
   (ఎ) దానిని ఎవరు రచించారు?
   (బి) ఏ భాషలో రచింపబడింది?
   (సి) గ్రంథకర్త ఎప్పుడు ఎక్కడ నివసించాడు?

3. దశరథుడి అల్లుడయిన ముని ఎవరు?
   (ఎ) ఆయన భార్య పేరేమిటి?
   (బి) ఆయన ప్రత్యేకత ఏమిటి?

4. నారదుడి వీణ పేరేమిటి?

(VIII పేజీ చూడండి)

## భారతీయ భాషలన్నిటిలోనూ ఒక మాట నేర్చుకుందాం

### ఈ నెల మాట: ఉదయం

అస్సామీ: రాతిపువ; బెంగాలీ: సకాల్; ఇంగ్లీష్: మార్నింగ్; గుజరాతీ: సబర్; హిందీ: సవేరా; కన్నడం: ముంజానె; కాశ్మీరీ: సుబహ్; మలయాళం: రావిలె; మరాఠీ: సకాళ్; ఒరియా: సకాళ; పంజాబీ: సవేరా; సంస్కృతం: ప్రభాత్; సింధీ: సుబుహు; తమిళం: కాలై; ఉర్దూ: సుబహ్.

## మీరు నమ్ముతారా?

* క్యాన్సర్ నయం చేయలేనటువంటి వ్యాధా?
* అన్నిరకాల మంచూ (ఐస్) కరుగుతుందా?
* ఇంద్రధనుస్సును సంపూర్ణ వృత్తాకారంలో చూడలేమా?

కావే కాదు!

- ఒక్క అమెరికాలో మాత్రం 1.5 మిలియన్ క్యాన్సర్ వ్యాధిగ్రస్తులకు పూర్తిగా నయమయింది.
- 'డ్రై ఐస్' కరగదు; ఆవిరవుతుంది.
- విమానంలో నుంచి చూస్తే పూర్తి వలయాకారంగా కనిపిస్తుంది.

# సమాధానాలు

### ఎవరాయన?

అశోకచక్రవర్తి

### చరిత్ర

1. భోపాల్; అమృతసర్. భోజ్‌పాల్ సరస్సు పేరును అనుసరించి భోపాల్ వచ్చింది. అమృతసర్, అదే పేరు గల సరస్సు నుంచి వచ్చింది.

(ఎ) భోపాల్; 11 వ శతాబ్దానికి చెందినది.

(బి) భోజరాజు

(సి) నాలుగవ సిక్కుగురువు రామదాసు.

2. త్రివేంద్రం. అసలుపేరు తిరు-అనంత-పురం.

(ఎ) పవిత్ర సర్ప (అనంత) నగరం.

(బి) ఏడుకొండలు

(సి) తిరువాన్కూర్.

3. మిజోరం. 'మి' అంటే మనిషి 'జో' అంటే కొండ.

4. షాజహానాబాద్. 1648 వ సంవత్సరం షాజహాన్ ఈ పేరు పెట్టాడు. అయితే, అది నిలబడలేదు.

5. మద్రాసు.

### లోకజ్ఞానం

1. జిబ్రాల్టర్‌కు అవతల ఉన్నదని భావించే ఒక దీవి. ప్లాటో దానిని గురించి రాశాడు.

2. దక్షిణ అమెరికాకు దూరంగా వున్నదని విశ్వసింపబడే సుసంపన్న ఆనంద రాజ్యం.

(ఎ) 'మలామా చేయబడిన మనిషి' అని అర్థం.

(బి) 'ఎల్ డొరడో' రాజు స్వర్ణరజంలో స్నానం చేసేవాడన్న ప్రతీతి ఉండడంవల్ల.

3. 1938, మార్చి నెలలో; చెషైర్‌లోని నార్త్‌విచ్‌లో.

4. ఇంగ్లాండుకు చెందిన జేమ్స్‌గిబ్ 1888 లేదా 1889 వ సంవత్సరంలో. ఒక వ్యాపార సంస్థ దీనికి కావలసిన పరికరాలను 1898వ సంవత్సరంలో తయారు చేసింది.

5. చౌడాగ్ జాతి కుక్కలకు మాత్రం నాలుక నల్లగా ఉంటుంది.

6. కరగదు.

7. అమితమైన వేడి.

8. దాదాపు 70 శాతం.

### సాహిత్యం

1. తెనాలి రామకృష్ణుడు; బీర్బల్; గోపాల్ భండ్.

(ఎ) ఆంధ్రప్రదేశ్, రాజస్థాన్, బెంగాల్ ప్రాంతాలకు చెందినవారు.

(బి) కృష్ణదేవరాయలు, అక్బర్, రాజా కృష్ణచంద్ర.

(సి) బీర్బల్. అతడు రాజపుత్ర సర్దారు; అక్బర్ అతనికి రాజా అన్న బిరుదు నిచ్చాడు.

2. తిరుక్కురళ్

(ఎ) తిరువళ్ళువర్

(బి) తమిళం

(సి) మైలాపూర్ (ఈనాటి మద్రాసులో ఒక భాగం)లో; దాదాపు రెండువేల సంవత్సరాల క్రితం.

3. ఋష్యశృంగుడు.

(ఎ) శాంత

(బి) వర్షం రప్పించగలడు.

4. మహతి

# నెహ్రూకథ–1



పద్దెనిమిదవ శతాబ్దారంభంలో మొగల్ చక్రవర్తి ఫరుక్‌షియ్యర్ కాశ్మీరుకు వెళ్ళినప్పుడు, అక్కడ రాజ్‌కౌల్ అనే బ్రాహ్మణ పండితుణ్ణి చూసి, అతని పాండిత్యానికి ముగ్ధుడయ్యాడు. ఆ రాజాదరణతో రాజ్‌కౌల్ కుటుంబం కాశ్మీరు నుంచి ఢిల్లీకి తరలివచ్చింది. ఢిల్లీలో ఒక కాలువ (నహర్) ఒడ్డున ఇల్లు కట్టుకోవడంవల్ల, వారిని నెహ్రూలు అని పి వసాగారు. ఆ కుటుంబానికి చెందిన గంగాధర్ నెహ్రూ, 1857 సిపాయిల కలహం జరగడానికి పూర్వం ఢిల్లీకి కొత్వాలుగా ఉండేవాడు. సిపాయిలకలహం సమయంలో ఆ కుటుంబం సర్వస్వాన్ని పోగొట్టు కున్నది. గంగాధర్ నెహ్రూ ఆగ్రా చేరుకున్నాడు. 1861వ సంవత్సరంలో అతడు మరణించిన మూడు నెలల తరవాత అతని కొడుకు మోతీలాల్ పుట్టాడు. మోతీలాల్‌ను అతని అన్నయ్య నందలాల్ పెంచి పెద్ద చేశాడు.



మోతీలాల్ చక్కగా చదివి న్యాయవాది అయ్యాడు. అప్పుడే స్థాపించబడిన అలహాబాదు ఉన్నతన్యాయస్థానంలో న్యాయవాదవృత్తిని చేపట్టాడు. అచిర కాలంలోనే సంపన్నుడయ్యాడు. అన్నయ్య మరణానంతరం, అతని కుటుంబమూ, తన కుటుంబమూ ఒకటిగా వుంటూ, ఉమ్మడి కుటుంబ బాధ్య తను సమర్థవంతంగా నిర్వహిస్తూ వచ్చాడు.

మోతీలాల్ ప్రథమ సంతానమూ, ఏకైక కుమారుడూ అయిన జవహర్‌లాల్ 1889 వ సంవత్సరం నవంబర్ 14 న జన్మించాడు. తండ్రి రోజల్లా పనిచేసి, సాయంకాలం తన మిత్రులతో సరదాగా కబుర్లు చెప్పుకుంటూ గడిపేవాడు. ఆ సమయంలో కుర్రవాడైన జవహర్‌లాల్, తెరచాటు నుంచి చూస్తూ, పెద్దవారి పోకడలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నించే వాడు.





ఒకనాడు, మోతీలాల్ ఎర్రటిమద్యం సేవించడం జవహర్ చూసి, పరుగు పరుగున వెళ్ళి, తల్లితో, "అమ్మా, అమ్మా, నాన్న రక్తం తాగుతున్నాడు!" అన్నాడు ఆశ్చర్యంగా. కుర్రవాడి అమాయకత్వానికి, ఆశ్చర్యానికి తల్లి స్వరూపరాణి తనలో నవ్వుకున్నది.

మోతీలాల్ సాధారణంగా ఎంతో ఉదారంగా వ్యవహరించేవాడు. కాని, కోపం వచ్చిందంటే మాత్రం కఠినంగా ప్రవర్తించేవాడు. జవహర్ ఒకనాడు, తన తండ్రి మేజా మీద రెండు పేనాలు ఉండడం చూశాడు. నాన్న ఒకేసారి రెండు పేనాలతో రాయడు కదా అనుకుని, జవహర్‌లాల్ వాటిలో ఒకటి తీసుకున్నాడు. విషయం గ్రహించిన మోతీలాల్ ఆగ్రహించి, కొడుకును బెత్తంతో కొట్టాడు.





దెబ్బలు తిన్నప్పటికి జవహర్‌లాల్‌కు తండ్రిపట్ల ఎలాంటి దురభిప్రాయమూ ఏర్పడలేదు. నాన్నకు తెలియకుండా పేనా తీసుకోవడం తప్పు; అందుకే కొట్టాడు—అని సరిపెట్టుకున్నాడు. జవహర్‌లాల్‌ను తల్లి స్వరూపరాణి ఎంతో ఆప్యాయంగా, అనురాగంతో చూసేది. ఆమె తరచూ తన బిడ్డకు, రామాయణ, మహాభారతాల నుంచి ఎన్నో కథలను చెప్పేది.

జవహర్‌లాల్‌కు పుట్టినరోజులన్నీ ఎంతో సంబరంగా గడిచేవి. బిడ్డచేత కొత్తబట్టలు ధరింపజేసి, అతన్ని పెద్ద తాసులో ఒక పళ్ళెంలో కూర్చోబెట్టి, మరొక పళ్ళెంలో గోధుమలూ, కూరగాయలూ వుంచి తులాభారం చేసి, ఆ తరవాత వాటిని పేదసాదలకు పంచిపెట్టేవారు. అటువంటి పుట్టినరోజు సంవత్సరానికి ఒక్కసారి మాత్రమే వస్తుంది కదా, అని బాలజవహర్‌కు బాధగా వుండేది.





ఒక సైనిక మిత్రుడి ప్రోత్సాహంతో జవహర్‌లాల్ తరచూ గుర్రపుస్వారీ చేసేవాడు. ఒకనాడు అతడు ఒంటరిగా గుర్రం మీద స్వారీ చేస్తూ, జారి కింద పడిపోయాడు. కుర్రరౌతు లేకుండానే గుర్రం ఇల్లు చేరుకున్నది.

ఆ సమయంలో మోతీలాల్ తన బంధు మిత్రులకు విందు ఏర్పాటు చేసి ఉన్నాడు. జవహర్‌లాల్ లేకుండా గుర్రం మాత్రం తిరిగి రావడం చూసి అందరూ భయపడి పోయారు. హడావుడిగా అతన్ని వెతుక్కుంటూ దిక్కుకొకరు పరుగులు తీశారు.





ఆఖరికి కుర్రవాడైన జవహర్‌లాల్ తిన్నగా ఇంటికేసి రావడం చూసి, అందరూ అవధులు లేని ఆనందం పొందారు. పెద్దయ్యాక నెహ్రూ ఈ విషయం గురించి ప్రస్తావించినప్పుడు, "ఏదో గొప్ప సాహసకృత్యం చేసి వచ్చిన వీరుడి లాగా నన్నారోజు అందరూ ఎంతగానో మెచ్చుకున్నారు!" అని అన్నాడు. —(ఇంకావుంది)



# కళాభిరుచి

విదర్భరాజయిన విచిత్రసేనుడిది, వింత మనస్తత్వం. ఏదైనా ఒక ఆలోచన తలకెక్కితే, అది ఒకపట్టాన వదిలేది కాదు.

ఒక రోజు ఆయన రంగులు కలిపి, కుంచెతో ఏవో పిచ్చిబొమ్మలు గీస్తూండగా ఉపసేనాని, ఏదో సొంతపని మీద రాజు దగ్గిరకు వచ్చాడు. అతను తన పని సానుకూలం చేసుకోవడానికి రాజుతో, "ప్రభూ, తమకు చిత్రకళలో ఆసక్తి వున్నదని తెలుసు. కాని, యింత గొప్ప కళాఖండాలు మీరు చిత్రించగలరని నేను ఊహించలేకపోయాను! ఇంతటి కళాప్రతిభతో తమరు చిత్రించే అపురూప చిత్రాలు, యిలా తమ అంతఃపురానికే పరిమితమైపోవడం చాలా విచారించదగ్గ విషయం," అన్నాడు ఎంతో లౌక్యంగా.

ఆ పొగడ్తలకు ఉబ్బితబ్బిబ్బయిన విచిత్రసేనుడు, "కళలన్నీ కడుపునిండిన కోటీశ్వరులకన్న ప్రతీతి వున్నది. ఇవి సామాన్యులకు ఏం మేలు చేస్తాయి?" అన్నాడు.

అందుకు ఉపసేనాని, "ఏకళ పరమావధి అయినా, ఆత్మానందమే కదా! మీరు చిత్రించిన కళాఖండాల నకళ్ళు వేల సంఖ్యలో చిత్రకారులచేత చిత్రింపజేసి, సామాన్యప్రజలకు అందుబాటులో ఉండే విధంగా వాటిని అతి చౌకధరలకు అమ్మకం చేయాలి. అందువల్ల సామాన్యులకు వాటిపట్ల ఆదరణ పెరగడంతోపాటు, కళాదృష్టి అలవడుతుంది," అన్నాడు.

ఉపసేనాపతి చెప్పిన మాటలప్రభావం, రాజుమీద పని జేయడం ప్రారంభించగానే, అతడు వచ్చిన పని ముగించుకుని వెళ్ళిపోయాడు. విచిత్రసేనుడు తన కళాఖండాలు సామాన్యప్రజలకు చౌకగా అందించే పథకం గురించి ఆలోచించసాగాడు.

ఎం. డి. సౌజన్య



మర్నాడు రాజు, తన మంత్రి అయిన మాదన్నతో, యీ విషయం ప్రస్తావించగా, ఆయన అంతా విని, "ప్రభూ, ఖరీదైన కళాఖండాలు తక్కువధరకు సామాన్యులకు అందించడానికి, ధనాగారం నుంచి లక్షలవరహాలు పెట్టుబడిగా పెట్టవలసి వస్తుంది. అంత ఖర్చుపెట్టినా, సామాన్యులకు కలగబోయే మేలు ఏపాటిదో చెప్పలేం. ఇందువల్ల మనం చేపట్టిన ముఖ్యమైన ఎన్నో అభివృద్ధి కార్యక్రమాలు కుంటుపడతాయేమోనని, నా భయం!" అన్నాడు మంచి సలహా యిస్తూ.

అయితే, విచిత్రసేనుడికి మంత్రి మాటలు రుచించలేదు. ఆయన వారం తిరక్కుండానే, చాలామంది చిత్రకారులను నియమించి, తను చిత్రించిన తైలవర్ణచిత్రాల నకళ్ళను ఖరీదైన చెక్కల మీద చిత్రింపజేసి, వాటిని రాజ్యమంతటా అతి చౌకధరలకు అమ్మే ఏర్పాట్లు చేయించాడు.

ఒక సంవత్సరం గడిచింది. ఒకనాడు విచిత్రసేనుడు, మంత్రితో, "మంత్రివర్యా! నేను చిత్రించిన కళాఖండాల ప్రభావం, మన రాజ్యంలోని సామాన్య ప్రజల మీద ఏ స్థాయిలో పని చేసిందో, స్వయంగా తెలుసుకోవాలని వున్నది. మనం మారువేషాల్లో, పొరుగు దేశపు వర్తకుల్లా బయలుదేరుదాం," అన్నాడు ఎంతో సంతోషంగా.

ఇలాంటి అవకాశం కోసం ఎదురు చూస్తున్న మంత్రి మాదన్న, మర్నాడే రాజును మారువేషంలో బయలుదేరదీశాడు.

ఇద్దరూ రాజధానిలో వున్న, ఒక పెద్ద దుకాణానికి వెళ్ళారు. అక్కడ అన్ని రకాల కళాత్మక వస్తువులతోపాటు, వివిధ చిత్రకారులు గీసిన రంగురంగుల చిత్రాలున్నవి. విచిత్రసేనుడు చిత్రించిన చిత్రాల నమూనాలున్న చిత్రపటాలు దొంతర్లుగా, దుకాణంలో ఒక మూల పడివున్నవి.



ఆసమయంలో, ఒక మధ్యవయస్కుడు దుకాణంలోకి వచ్చి, దుకాణదారుతో, "కొత్తగా కట్టిన మా ఇంటికి దిష్టిబొమ్మ ఏది కొందామన్నా చాలా ఖరీదు చెబుతున్నారు. మన విచిత్రసేన మహారాజుగారు చిత్రించిన బొమ్మలు, మీరు చౌకధరకు అమ్ముతున్నట్టున్నది. అదొకటి యివ్వండి!" అన్నాడు.

ఆ మాటలు విన్న రాజుకు ఎంతో అవమానం అనిపించింది. ఇక అక్కడి నుంచి వెళ్ళిపోదామనుకుంటుండగా, చిత్రకారుడొకడు వచ్చి, దుకాణదారును, "మన విచిత్రసేనులవారి కళాఖండాలు రెండివ్వండి!" అంటూ దుస్తుల్లోనుంచి డబ్బు తీశాడు.

మంత్రి మాదన్న, ఆ వచ్చినవాడు చిత్రకారుడని తెలుసుకుని, "మీవంటి చిత్రకారులు, మన రాజుగారి కళాఖండాలు కొంటున్నారని తెలిసి చాలా సంతోషంగా వున్నది. మీరు విద్యార్థులకు చిత్రకళ నేర్పేందుకు వీటిని ఆదర్శంగా తీసుకుంటున్నారన్నమాట!" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

ఆ వెంటనే చిత్రకారుడు చిన్నగా నవ్వి, "ఒక మంచి చిత్రాన్ని కళాత్మక విలువలు ధ్వంసం చేస్తూ, ఎలా చిత్రించవచ్చునో, ఉదాహరణగా మా విద్యార్థులకు చూపడానికే, యీ చిత్రాలను ఉపయోగిస్తున్నాము!" అన్నాడు.

ఆ మాటలతో తల తిరిగిన రాజు, అక్కడి నుంచి వెళ్ళబోతూండగా, ఒక వృద్ధస్త్రీ, ఆయన చిత్రించిన నాలుగు చిత్రపటాలు కొని తీసుకుపోసాగింది.

మంత్రి ఆమెను సమీపించి, "ఏమమ్మా! ఒక్కసారే నాలుగు చిత్రపటాలు కొన్నావు. కనీసం పాతతరం వాళ్ళలో అయినా, యింకా కళాత్మక హృదయం వున్నందుకు సంతోషించాలి," అన్నాడు.

మంత్రి మాటలకు వృద్ధస్త్రీ సిగ్గుపడుతూ, "కళాత్మకవిలువలు, ఎవరో కడుపునిండిన మహారాజులకుగాని—

నావంటి పేదదానికి కాదు, బాబూ! నిజానికి, యీ నాలుగు చిత్రాలు గీయ డానికి వాడిన కొయ్యచెక్క చాలా ఖరీదై నది. మా పాత పెంకుటింటి రెండు కిటికీ చెక్కలూ విరిగిపోయాయి. బోలెడు డబ్బు పోసి టేకుచెక్కలు కొనలేక, యీ చెక్క ముక్కలు కొని తీసుకుపోతున్నా. రెండు కిటికీలకూ, మిగిలిన రెండూ పెళ్ళలు ఊడిన, మా పాతగోడలకూ తగిలిస్తా,'' అన్నది.

ఆమె నిజాయితీగా చెప్పిన మాటలకు, ఏం జవాబు చెప్పాలో తోచక మంత్రి, రాజుకేసి చూశాడు.

అప్పటికిగాని, రాజు విచిత్రసేనుడికి, తన చిత్రకళాప్రతిభనూ, కళాపోషక త్వాన్నీ సామాన్య ప్రజలు ఎలా అంచనా వేస్తున్నారో అర్థం కాలేదు.

ఆయన మంత్రితోపాటు కోటకు తిరిగి వచ్చి, ఎక్కడలేని నిరుత్సాహంతో, ''మంత్రివర్యా! సామాన్య ప్రజలకు కళా దృష్టి అలవడేలా చేయాలన్న ఆశకొద్దీ నేను పెద్ద పొరబాటే చేశాను. నా చిత్రా లకు నకళ్ళు గీసే చిత్రకారులందరినీ, యీనాడే ఉద్యోగాల్లోంచి తొలగించండి,'' అన్నాడు.

దానికి మంత్రి, ''ప్రభూ, తమరు మరోలా భావించకపోతే, ఒక సంగతి చెప్పదలిచాను. సామాన్యప్రజలకు లలిత కళలపట్ల ఆసక్తి కలిగించడం ఎంతయినా అవసరం. కాని, అందుకు ప్రతిభావంతు లైన కళాకారులు పూనుకోవాలి. అలాంటి వారిని, పాలకులైన తమరు ఆదరించాలి!" అన్నాడు.

మంత్రి యిలా అనగానే, రాజు తన తప్పును గ్రహించి తన చిత్రాలకు ప్రతి చిత్రాలు తయారు చేస్తున్న చిత్రకారులలో ప్రతిభావంతులైన వాళ్ళ అధ్వర్యంలో, చిత్ర కళాశాలలు ప్రారంభించాడు.

చిత్రకళపట్ల ఆసక్తిగల ఎందరో యువకులు అక్కడ విద్యార్థులుగా చేరి, సామాన్య ప్రజలకు చిత్రకళపట్ల ఆసక్తి, ఆదరణభావం కలిగేలా చేశారు.





# కృష్ణావతారం

రుక్మిణికి మర్నాడు జరగనున్న వివాహం గురించి చెప్పి నారదుడు వెళ్ళిపోగానే, కృష్ణుడు తన వారితో, "నారదమహాముని, మన శ్రేయస్సు కోరి చెప్పిన మాటలు మీరంతా విన్నారు కద! ఇంక ఆలస్యం దేనికి? పనికి ఉపక్రమించుదాం— వెంటనే బయలుదేరి కుండినపురానికి పోదాం. మీ మీ వాహనాలనూ, సేనలనూ అయత్తం చేసుకోండి. బలగం బయలు దేరేటప్పుడు ముందు సాత్యకి, మధ్యలో బలరాముడూ, చివరలో ఉగ్రసేన మహా రాజూ ఉండేటట్టు చూడండి. నేను దారకుణ్ణి వెంట తీసుకుని, సమస్తమైన ఆయుధాలతో సహా ముందు వెళ్ళి, ఆ శిశుపాలుడూ, రుక్మి, జరాసంధుడూ మొదలైన వాళ్ళ సంగతి అంతు చూసి, రుక్మిణిని సంపాదించుకుంటాను," అన్నాడు.

ప్రయాణ దుందుభి మోగించారు. యాదవులందరూ ఆర్భాటంగా ప్రయాణ సన్నాహాలు చేశారు. కృష్ణుడు తృప్తిపడి, తనను తాను చక్కగా అలంకరించుకుని రథంలో బయలుదేరాడు.

అతడు పెళ్ళికొడుకు లాగా, మహా వైభవంతో ప్రయాణం చేసి, విదర్భదేశం చేరి, కుండిన పురాన్ని చేరబోతూండగా, రుక్మిణి తండ్రి అయిన భీష్మకుడు ఎదురు వచ్చి, ఆదరించి, నగరం బయట ఉన్న విడిదికి తీసుకుపోయి, అతిథి మర్యాద లన్నీ చేశాడు.

**17. రుక్మిణి అపహరణం**



పెళ్ళికి వచ్చిన రాజులందరూ కృష్ణుణ్ణి చూసి రకరకాలుగా మాట్లాడుకున్నారు.

''శిశుపాలుడు కృష్ణుడికి మేనత్త కొడుకేగా? అతని పెళ్ళిగదా అని చూడ వచ్చి ఉంటాడు,'' అన్నారు కొందరు.

''అదంతా ఏమీ లేదులే. ఈ కృష్ణుడికి జరాసంధ శిశుపాలు లంటే ఏ మాత్రమూ పడదు. అటువంటి వాడు ఎందుకు వచ్చినట్టు?'' అన్నారు మరికొందరు.

యాదవుల నందరినీ వెంటబెట్టుకుని కృష్ణుడు వచ్చాడని వినగానే రుక్మిణికి, వేసవి ఎండలకు తెగ కాలి ఉన్న భూమి మీద వర్షం పడినంతగా పరమానంద మయింది. ''నన్నీ కష్టాలనుంచి ఉద్ధరించటానికే కృష్ణుడు వచ్చాడు, అందుకు సందేహమేమీ లేదు. నా జన్మ నిజంగా తరించింది. నా కోరిక ఈడేరింది. అతన్ని ఎప్పుడు కళ్ళ చూస్తానో!'' అనుకున్నదామె.

ఆమె కృష్ణుణ్ణి గురించి రకరకాలుగా ఊహించుకోనారంభించింది; చెలికత్తెలతో అతని కథలు మళ్ళీ మళ్ళీ చెప్పించింది; ఆమెలో ముందుండిన దైన్యమంతా పోయి కొత్త కళ వచ్చింది.

కృష్ణుడు కూడా మిగిలిన విషయాలేవీ పట్టించుకోక రుక్మిణిని గురించిన ఆలోచనలలో మునిగిపోయాడు. ఆమెను తాను ఎలా చూస్తాడు? ఆమెను ఎలా అపహరిస్తాడు? తనకు అడ్డుపడే శత్రువుల నందరినీ ఎలా ఎదుర్కొంటాడు? ఇంతకూ ఆమెకు తనమీద మనస్సున్నదని విన్న మాట నిజమో కాదో ఎలా తెలుసుకోవటం?

''ఏమైనా కానీ, ఆమె నాకేసి అపేక్షగా చూసిందో, దేవతలు అడ్డుపడినా సరే, ఆమెను తప్పక సంపాదిస్తాను,'' అనుకున్నాడతను.

తెల్లవారింది. తేనెటీగలు పద్మాల మీదికి ముసిరాయి. చక్రవాకాలకు గుడ్డితనం పోయింది. హంసలు కొలనుల్లో విహరించసాగాయి. కలువలు ముడుచుకుపోయాయి. సూర్యోదయమయింది.

కృష్ణుడు కాలకృత్యాలు తీర్చుకుని, చక్కగా అలంకరించుకుని, తన పరివారాన్ని వెంటబెట్టుకుని, సంతోషంగా విడిది నుంచి రథం మీద బయలుదేరాడు. రుక్మిణిని చూడాలన్న కోరిక అతన్ని తీవ్రంగా ఆవేశించింది.



రాజసౌధంలో రుక్మిణిని చెలికత్తెలు చక్కగా అలంకరించి ముస్తాబు చేశారు. అలంకరణ పూర్తి కాగానే ఆమె ఒక బంగారు పల్లకీలో ఎక్కి, చెలికత్తెలు వెంట రాగా, నగరం వెలపల ఉండే గౌరీదేవిని అర్చించి రావటానికి బయలుదేరింది. ఆమె ఆలయం దగ్గిర పల్లకి దిగి, లోపలికి చెలికత్తెల మధ్య నడిచి వెళ్ళి, దేవికి మొక్కి, "తల్లీ, నాకు కృష్ణుడే భర్త అయేటట్టు అనుగ్రహించు," అని ప్రార్థించింది.

రుక్మిణి గౌరిఆలయం నుంచి బయటికి వచ్చే సమయానికి కృష్ణుడు అక్కడికి వచ్చి, మొట్టమొదటిసారిగా ఆమెను చూశాడు. అమె అప్పుడే పాలసముద్రం నుంచి పైకి వచ్చిన లక్ష్మీదేవి లాగా అతనికి కనబడింది. బ్రహ్మసృష్టిలో అంతటి సౌందర్యవతి మూడు లోకాలలో చూసినా ఉంటుందని అతనికి తోచలేదు. ఆమెను గురించి విన్న దానితో కలిగిన ఉద్వేగాన్ని భరించాడు గాని, ఆమెను కళ్ళ ఎదట చూస్తూ ప్రేమోద్వేగాన్ని నిగ్రహించుకోవటం అతనికి సాధ్యంగా కనబడలేదు.

రుక్మిణిని తన దాన్ని చేసుకోవటానికి తగిన చోటూ, సమయమూ దైవికంగా అతనికి కలిసి వచ్చాయి. ఇలాంటి అవకాశాన్ని పోగొట్టుకోవటం అవివేకం అని అతను తనలో అనుకున్నాడు.

ఇదే సమయంలో రుక్మిణి కూడా కృష్ణుణ్ణి మొదటిసారిగా చూసింది. అతనే కృష్ణుడని చెలికత్తెలామెకు చెప్పారు. ఆమె అతనికేసి ఒళ్ళంతా కళ్ళు చేసుకుని చూసింది. ఇంతకాలమూ తాను విడవకుండా ధ్యానం చేస్తున్నవాడు అకస్మాత్తుగా తన కళ్ళ ముందు కనిపించేసరికి



భటులు కృష్ణుడి మీదికి రాసాగారు. బలరాముడు చెట్టొకటి పీకి, మీదికి వచ్చే రథాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ, సైనికులనూ చావమోది, చెల్లాచెదరు చేశాడు.

ఈ అర్భాటం విని, ఉగ్రసేనుడూ, సాత్యకీ, శతద్యుమ్నుడూ, విదూరథుడూ, ప్రసేనజిత్తూ మొదలైన యదువృష్ణి భోజాంధక వీరులు తమ తమ బలాలతో వచ్చి బలరాముడికి అండగా నిలబడి, కృష్ణుడితో, ''నువ్వా పిల్లను తీసుకుని ద్వారకకు వెళ్ళిపో. ఇక్కడ ఉండే వాళ్ళందరి సంగతీ మేము చూసుకుంటాం,'' అన్నారు.

వీరంతా యుద్ధానికి సిద్ధపడుతూ ఉంటే, రుక్మిణి అంగరక్షకులైన భటులలో చావగా మిగిలిన వాళ్ళు వెళ్ళి, రుక్మిణి అపహరణం గురించి భీష్మకుడికీ, జరాసంధుడికీ, శిశుపాలుడికీ, వారి వెంట వచ్చిన రాజులకూ తెలిపారు. అందరూ ఈ వార్త విని ఆశ్చర్యపడుతూ, ''ఇంత మంది మహాయోధు లిక్కడ ఉండగా కృష్ణు డింత పని చేశాడే! వాడి కెంత పొగరు, ఎంత సాహసం, ఎంత ధైర్యం!'' అనుకున్నారు.

జరాసంధుడు కోపంతో దహించుకుపోతూ, కళ్ళ నిప్పులు రాల్చుతూ, ''ఒక

ఆమెకు ఆశ్చర్యమూ, కంపమూ, ఆనందమూ ఒకేసారిగా కలిగాయి. ఆమె కళ్ళు చల్లగా చెమ్మగిల్లాయి. సమాధి స్థితిలోకి వెళ్ళిపోయిన యోగి లాగా ఆమె తనను తానే మరచిపోయింది. ఆమె అలా అయిపోవటం చూసి చెలికత్తెలు చాలా భయపడ్డారు.

ఇంతలో బలరాముడు వచ్చి కృష్ణుణ్ణి కలుసుకున్నాడు. కృష్ణుడు తాను చేయదలచిన పనిని గురించి తన అన్నకు సంగ్రహంగా చెప్పి, రుక్మిణిని అమాంతంగా కౌగలించుకుని, ఎత్తితెచ్చి తన రథం మీద పెట్టాడు. రుక్మిణి చెలికత్తెలు కంగారుపడ్డారు. సమీపంలో ఉండే



గోపకుడి కొడుకు మహా జగదేకవీరుడల్లే వచ్చి నా ప్రయత్నమంతా పాడు చేశాడు. నేను నా సేనతో సహా బయలుదేరి వెళ్ళి వాడి మీద దాడి చెయ్యబోతున్నాను. ఇష్టమైతే మీరు కూడా సహాయం రండి,'' అని మిగిలిన వారితో అన్నాడు.

సముద్రమే కోటగా గల ద్వారకలో ప్రవేశించినాసరే, కృష్ణుణ్ణీ, అతడి బంధువుల నందరినీ హతమార్చి, ద్వారకను ధ్వంసం చేసి, రుక్మిణిని తెస్తానని ఆ జరాసంధుడు అందరి ఎదటా గొప్పగా ప్రతిజ్ఞ చేశాడు.

పౌండ్రకవాసుదేవుడు జరాసంధుణ్ణి వారిస్తూ, ''నీ భృత్యుణ్ణి నే నుండగా నీ కెందుకు శ్రమ? నేను వెళ్ళి, ఆ కృష్ణుణ్ణి ముక్కలు ముక్కలుగా నరికి, అడవి పక్షులకు ఆహారంగా వేస్తాను. భూమి మీద ఇద్దరు వాసుదేవులెలా ఉంటారు? ఈ పొరపాటు సరి చెయ్యటానికీ, నీకు ఆనందం చేకూర్చటానికీ గొప్ప అవకాశం నాకు దొరికింది. ఇంకేం కావాలి?'' అన్నాడు.

అంతలోనే శిశుపాలు డొక పెద్ద పరిఘ చేత బట్టి నిలబడి, అందరూ వినేటట్టుగా, ''ఆగండి! ఎవరూ కదల వద్దు! ఈ అవమానం నాది. పెళ్ళి చేసుకుందామని ఉబలాటంతో వచ్చి చివర కిలా భంగపాటు పొందిన వాణ్ణి నేను. ఈ ఒక్క పరిఘతోనే ఆ కృష్ణుణ్ణీ, మిగిలిన యాదవులనూ రూపుమాపి, జరాసంధుడి భృత్యుడుగా గొప్ప కీర్తి సంపాదించుకుంటాను. నిజంగా క్షత్రియుడైనవాడు మరొకడి భార్య కోసం ఇలా ఆశపడతాడా? ఈ యాదవ గోత్రీకుడు చాలా హీనుడై ఇలా చేశాడు. వాడు పెరిగినది వావీ వరసా లేని పశువుల మధ్య. అందుచేత, కృష్ణుణ్ణి చంపి రుక్మిణిని తీసుకు రావటం నా పని,'' అన్నాడు.

తరవాత జరాసంధుడు మొదలైన రాజులందరూ, కవచాలు ధరించి, రథాలెక్కి యుద్ధ సన్నద్ధులయారు. అదే

విధంగా సేనలన్నీ భేరీలూ, శంఖాలూ మొదలైన వాద్యాలు మోగించుకుంటూ అట్టహాసంగా బయలుదేరాయి.

త్వరలోనే వారు, రథం మీద రుక్మిణిని ఉంచుకుని పోతున్న కృష్ణుణ్ణీ, అతని వెనకగా పోతున్న యాదవసేనలనూ చేర వచ్చారు.



బలరాముడు మొదలైన యాదవ వీరులు తమ సేనలను ఆపి, జరాసంధుడి బలాలతో యుద్ధం ప్రారంభించారు. యాదవ సేన చిన్నది, జరాసంధుడి సేనలు పెద్దవి. అయినా జరాసంధుడి సేనలోనే హెచ్చుగా రక్తపాతం జరిగింది. ఉభయపక్షాల వీరులూ ద్వంద్వయుద్ధాలు చేశారు. సాత్యకీ, జరాసంధుడూ మహా దారుణమైన యుద్ధం చేశారు. శత్రదేవుడూ, అక్రూరుడూ కలిసి దంతవక్త్రుడితో యుద్ధం చేశారు. శిశుపాలుడు ముగ్గురు యాదవ వీరులతో ఒకేసారి అతి భయంకరంగా పోరాడాడు. కృతవర్మకూ పౌండ్రక వాసుదేవుడికీ భీకరంగా యుద్ధం జరిగింది.

అందరికన్న బలరాముడు మహా భయంకరంగా శత్రునాశనం చేశాడు. అవతలి పక్షాన జరాసంధుడు కూడా చాలా దారుణంగా యుద్ధం చేశాడు. చివరకు బలరాముడే అతన్ని గదా యుద్ధంలో మూర్ఛపోగొట్టాడు. వెంటనే జరాసంధుణ్ణి అతని సారథి రథంమీద పెట్టుకుని, దూరంగా తీసుకుపోయాడు. అది చూసి సేనలు పలాయనం సాగించాయి. ఆ పారిపోయేవాళ్ళను సాత్యకి మరింత తరిమాడు. సాత్యకి శంఖం పూరించటం విని కృష్ణుడు, జరాసంధుడు పారిపోయినట్టు గ్రహించి, తన పాంచజన్యాన్ని ఊదాడు.

కృష్ణుడు రుక్మిణిని ఎత్తుకుపోతున్నాడన్న వార్త విని జరాసంధుడు మొదలైన రాజులు తమ విడిది నుంచి సైన్యాలతో సహా బయలుదేరే సమయంలోనే, రాజభవనంలో ఉన్న రుక్మి కూడా ఆ వార్త

విని, మండిపడి, యుద్ధంలో కృష్ణుణ్ణి చంపి, రుక్మిణిని తీసుకురాకుండా తిరిగి నగరంలో అడుగు పెట్టనని తన తండ్రి ఎదటా, బంధువుల ఎదటా శపథం చేసి, గదుడూ, కైశికుడూ మొదలైన యోధులనూ, సేనలనూ వెంటబెట్టుకుని, యుద్ధ సన్నద్ధుడై బయలుదేరాడు. అతనితోబాటు దక్షిణదేశాల రాజులు కూడా పలువురు ఉన్నారు.

వారికి కృష్ణుడి రథం నర్మదాతీరం వెంబడి ఒంటరిగా నడుస్తూ అంత దూరాన కనిపించింది. రుక్మి మిగిలిన వారందరినీ వెనకనే వదిలేసి, అతి వేగంగా తన రథాన్ని తోలించి, కృష్ణుడి రథానికి ఎదురు వెళ్ళి, ''ఎక్కడికి పోతావురా, ఇతరుడి భార్యను అపహరించేవాడా! నేను రుక్మిని! విదర్భరాజు కొడుకును! ప్రాణాలు దక్కించుకోదలిస్తే రుక్మిణిని తక్షణం వదిలెయ్యి, లేదా నాతో యుద్ధం చెయ్యి.'' అంటూ కృష్ణుడిపైన బాణవర్షం కురిపించాడు.

కృష్ణుడు క్షణంలో అతని సారథిని చంపి, అతని శరీరంనిండా బాణాలు గుచ్చాడు.

రుక్మి దుస్థితి చూసి దక్షిణ దేశపు రాజులు తమ మిత్రుణ్ణి కమ్ముకుని, అమితాగ్రహంతో కృష్ణుడితో యుద్ధానికి పూనుకున్నారు. కృష్ణుడికీ, వారికీ మధ్య తీవ్రమైన యుద్ధం జరిగింది. కొంత సేపటికి రుక్మి తిరిగి బలం తెచ్చుకుని, మరొక రథం మీద వచ్చి, కోపావేశంతో కృష్ణుడిపై తలపడ్డాడు. కృష్ణుడు అతని రొమ్ములో దిగేలాగు మూడు బాణాలు కొట్టి, రుక్మిని మూర్ఛపోగొట్టాడు. నేలమీద స్పృహ తప్పి పడిపోయిన అన్నను చూసి రుక్మిణి కృష్ణుడి రథంమీద కూలబడిపోయి, దుఃఖించసాగింది.

కృష్ణుడు రుక్మిణిని కౌగలించుకుని, నెమ్మదిగా ఓదార్చి, రుక్మిని ఏమీ చేయనని ఆమెకు అభయమిచ్చి, రథాన్ని తిరిగి వెనక్కు తిప్పించి, తన నగరానికి బయలుదేరాడు.






# సరి అయిన వైద్యం

నాగపురం అనే ఊళ్ళో వుండే, బ్రహ్మం అనే యువకుడు, అనారోగ్యంతో బాధ పడుతున్న తల్లిని తీసుకుని, వైద్యుడి ఇల్లు చేరేసరికి, ముందు గదిలో చాలా మంది రోగులు కూర్చునివున్నారు.

బ్రహ్మం తల్లిని ఒక పెడగా కూర్చో బెట్టి, "మనవంతు వచ్చేసరికి చాలా సేపయేలా వున్నది. అలా బజారుకు వెళ్ళి వస్తాను," అంటూ అక్కడి నుంచి బయలుదేరాడు.

పాతికేళ్ళవయసు వచ్చినా, బ్రహ్మానికి ఏ పనీ చేతకాదు. ఆ కారణంవల్ల ఎవరూ వాడికి పని యివ్వలేదు. చిన్నతనంలోనే తండ్రి పోవడంతో తల్లి వాణ్ణి చాలా గారాబంగా పెంచింది. వాడికి చదువు అబ్బలేదు; ఒళ్ళువంచి పనిచెయ్యడం యిష్టం లేదు. క్రమంగా జూదాలకూ, చెడు స్నేహాలకూ అలవాటు పడి, అక్కడా యిక్కడా చిన్న చిన్న దొంగతనాలు చేస్తూండేవాడు. ఈ మధ్య వాడికి, ఎలాగైనా డబ్బు మొత్తంగా ఒకేసారి సంపాయించాలన్న ఆశపట్టుకున్నది.

అంతకు ముందు రోజు బ్రహ్మం, ఊరి చివరనున్న చెరువు దగ్గిర కాపలా వేశాడు. చీకటిపడుతున్నవేళ ఒక వ్యక్తి అటుగా వచ్చాడు. బ్రహ్మం చప్పున చెట్టుచాటు నుంచి బయటకు వచ్చి, కత్తిని ఆ వ్యక్తి గుండెలకేసి చూపుతూ, "మర్యాదగా, చేతిలో వున్న ఆ సంచీ యిచ్చెయ్యి?" అన్నాడు కరకుగా.

ఆ వ్యక్తి భయంతో వణికిపోతూ సంచీని కింద పడవేసి, ఊరికేసి పరిగెత్తాడు.

సంచిలో బ్రహ్మానికి నాలుగువేల రూపాయిలు దొరికాయి. అంత డబ్బు ఏం చేయాలో తోచక వాడు, ఒక వంద

మాచిరాజు కామేశ్వరరావు

రూపాయిలు మాత్రం తీసుకుని, సంచిని దాపులనున్న ఒక చింతచెట్టు తొర్రలో గుర్తుగా దాచాడు.

వాడు ఇల్లు చేరేసరికి, వాడి తల్లి విపరీతమైన చలిజ్వరంతో వణుకు తున్నది.

"రేపు నిన్ను వైద్యుడి దగ్గిరకు తీసుకు పోతాను. నీకు సరిఅయినవైద్యం జర గాలి," అన్నాడు చేతినిండా డబ్బున్న బ్రహ్మం, తల్లితో.

ఆ విధంగానే వాడు మర్నాడు తల్లిని, వైద్యుడి దగ్గిరకు తీసుకువచ్చాడు. ఆమెను వైద్యుడింట వదిలి, వాడు కొంతసేపు వీధుల్లో తిరిగి, మళ్ళీ వైద్యుడింటికి వచ్చే సరికి రోగులందరూ వెళ్ళిపోయారు. వాడి తల్లి, కాళ్ళూ చేతులూ కొట్టుకుంటూ, కళ్ళు తేలవేస్తున్నది. వైద్యుడు ఆమె నాడిని పరీక్షిస్తున్నాడు.

"మా అమ్మకు ఏమయింది?" అంటూ బ్రహ్మం గబగబా పోయి తల్లి పక్కన కూర్చుని, ఆమె రెండు చేతులూ పట్టు కున్నాడు.

"నువ్వు, యీామె కొడుకువా? సమ యానికి వచ్చావు. నీ తల్లికి వాతం కమ్మింది. గరిట కాల్చి వాత వేయక తప్పదు!" అన్నాడు వైద్యుడు.

అంతలో వైద్యుడి నౌకరు, గరిట నొక దాన్ని ఎర్రగా కాల్చి తెచ్చాడు. బ్రహ్మం, తల్లి రెండు చేతులూ మరింత గట్టిగా పట్టుకున్నాడు. అయితే, వైద్యుడు తల్లికి



పెట్టవలసిన వాత, వాడి చేతి మీద పెట్టే సరికి, బ్రహ్మం బాధతో కెవ్వుమంటూ అరిచాడు.

"అయ్యో, ఎంత పొరబాటు! సరిగ్గా సమయానికి, నీ చేయి అడ్డు వచ్చింది. ఆ వాత నీ తల్లికే పెట్టివుంటే, ఆమె నీకు దక్కివుండేది!" అన్నాడు వైద్యుడు.

చేతి మీది వాత, తల్లి పోయిందన్న వార్త బ్రహ్మన్ని పిచ్చివాణ్ణి చేశాయి.

వాడు చప్పున వైద్యుడి మెడపట్టుకుని, "నా తల్లిని చంపావు! నువ్వు వైద్యుడివి కాదు, హంతకుడివి!" అంటూ అరవ సాగాడు.

వైద్యుడు, బ్రహ్మం చేతిని పక్కకు లాగి, "ఇంతవరకూ నువ్వు దొంగవే అనుకుంటున్నాను. ఇప్పుడు నువ్వు హంతకుడివి కూడా అని తెలుస్తున్నది. నిన్న నువ్వు దోచిన డబ్బు—ఒక తండ్రి కూతురి పెళ్ళికోసమని, ఉన్న కొద్దిపొలం అమ్మి తెస్తున్నది. ఇక తనకు పెళ్ళి కాదని ఆమె బావిలో దూకింది. దహన సంస్కారాలకు కూడా డబ్బు లేక, ఆమె తండ్రి దుఃఖిస్తున్నాడు. ఆ పెళ్ళికి అడ్డుపడిన నీ చేతి మీద వాతపడింది. అదే మీ అమ్మ ప్రాణం పోవడానికి కూడా కారణం అయింది," అన్నాడు.

ఇది విన్న బ్రహ్మనికి ఎక్కడలేని పశ్చాత్తాపం కలిగింది. తను చేసిన దొంగతనం, ఒక కుటుంబంలో రేపిన చిచ్చు, వాడి గుండెలకు పాకింది.



వాడు, వైద్యుడి పాదాలు పట్టుకుని, "ఆ తండ్రి శాపమే, మా అమ్మను పొట్టన పెట్టుకున్నది. నేను కష్టపడి సంపాయించి, మా అమ్మకు సరిఅయిన వైద్యం సమ్మయానికి చేయించి వుంటే, తప్పక బతికేది. ఇప్పుడే వెళ్ళి, ఆ డబ్బు తెచ్చియిస్తాను. అప్పుడే మా అమ్మ ఆత్మకు శాంతి!" అంటూ బయటికి వెళ్ళిపోయాడు.

వాడు అటు పోగానే, వాడి తల్లి లేచి కూర్చుని, వైద్యుడితో, "అయ్యా, నా కొడుకు దొంగ అని యింతకాలంగా నేనెరగనే ఎరగను. వాడికి సరిఅయిన వైద్యం చేసి, వాడిలో మార్పు తెచ్చారు," అన్నది.

"నీ కొడుకు, మనం వేసిన పథకంతో, మారతాడో లేదో అన్న అనుమానం కొద్దీ, చేతి మీద గట్టిగా వాత వేశాను. ఆ వాతకు నేను ఉచితవైద్యం చేస్తానులే," అన్నాడు వైద్యుడు నవ్వుతూ.

అప్పటివరకూ, లోపలిగదిలో వున్న వైద్యుడి బంధువు, ఆయన దగ్గిరకు వచ్చి, "తల్లిని వెంటబెట్టుకువస్తున్న బ్రహ్మన్ని, నా దగ్గిర డబ్బు దోచిన దొంగగా గుర్తించడం మేలే అయింది. అందరం కలిసి వేసిన పథకం బాగానే పారింది. కాని, దీని వెనక కాబోయే పెళ్ళికూతురు ఆత్మహత్య కథ అల్లావెందుకు?" అని వైద్యుణ్ణి అడిగాడు.

"బ్రహ్మం మనసు కరగడానికి, ఉత్తుత్తి కథ అల్లాను. అది వాడి మీద బాగా పని చేసింది!" అంటూ వైద్యుడు చిన్నగా నవ్వాడు.

డబ్బు సంచీతో గదిలోకి వస్తూ, యీ సంభాషణ విన్న బ్రహ్మం, "దొంగ అని నలుగురిచేతా పిలిపించుకోవడం కన్న, చావడం మేలు. మా అమ్మ బతికి, నాకు పునర్జన్మ నిచ్చింది. ఇక నుంచి కష్టపడి పనిచేసి సంపాయిస్తాను," అంటూ సంచీని వైద్యుడి బంధువుకు యిచ్చాడు.

వాడిలో వచ్చిన మార్పుకు తల్లితోపాటు, చాలా సంతోషించిన వైద్యుడూ, ఆయన బంధువూ చేతులెత్తి వాణ్ణి దీవించారు.





# అదృష్టం

ఒక ఊళ్ళో ఇద్దరు ముసలివాళ్ళు ఉండే వాళ్ళు. ఒకడు మంచివాడు, ఒకడు చెడ్డ వాడు. ఒక ఏడు సంవత్సరాది రోజున ఆ ఇద్దరూ కలుసుకున్నారు.

''నాకు రాత్రి చిత్రమైన కల వచ్చింది. నా అదృష్టం ఆకాశం నుంచి వచ్చి పడిందట,'' అన్నాడు మంచివాడు.

''చిత్రంగానే ఉన్నది. ఎందుకంటే, నాకూ నా అదృష్టం కలలో వచ్చింది. అది భూమిలో నుంచి వచ్చిందట,'' అన్నాడు చెడ్డవాడు.

''ఎవరి అదృష్టం ఎలా వస్తుందో చూద్దాం,'' అని మంచివాడు తన ఇంటికి వెళ్ళి పోయాడు.

కొన్ని రోజులు గడిచాక చలిరోజులు వెనకపడ్డాయి.

''ఇవాళ పొలం పని ప్రారంభించ వచ్చు,'' అనుకుని మంచివాడు పారా, పలుగూ తీసుకుని పొలానికి వెళ్ళి, తవ్వటం మొదలు పెట్టాడు. ఉన్నట్టుండి పలుగుకు ఏదో తగిలి ఖంగు మన్నది. పొలంలో పలుగురాళ్ళు ఎలా వచ్చాయా అని ఆశ్చర్యపడుతూ, తవ్వి తీసి చూస్తే అది ఒక బిందె! మంచివాడు దాని మూత తీసి చూసే సరికి, అందులో బంగారు కాసులూ, మొహరీలూ కనిపించాయి. మంచివాడు ఆ బిందెను తిరిగి యథా ప్రకారం పెట్టేశాడు.

''పాపం, ఈ నిధి ఆ ముసలాడిది అయి ఉంటుంది. తన అదృష్టం భూమిలో దొరికినట్టు సంవత్సరాదినాడు అతను కల వచ్చిందన్నాడు. వెళ్ళి అతనితో చెబు తాను,'' అనుకుని మంచివాడు చెడ్డవాడి దగ్గిరికి వెళ్ళి, ''పెద్దయ్యా, నీ అదృష్టం నా పొలంలో దొరికింది. బిందెనిండా బంగారు కాసులూ, మొహరీలూ

జపాను జానపద కథ

ఉన్నాయి. నా పొలానికి వెళ్ళి తెచ్చుకో,'' అని చెప్పి, ఇంటికి వెళ్ళిపోయాడు.

అతను ఇంటికి వెళ్ళి తన భార్యతో జరిగిన దంతా చెప్పి, ''తన అదృష్టం నా పొలంలో దొరికిందని చెబితే, పాపం, పెద్ద వాడు చాలా సంతోషించాడు. ఈ పాటికి అతను బిందెను ఇంటికి తెచ్చుకుని ఉంటాడు,'' అన్నాడు.

''న్యాయమైన పని చేశావు,'' అన్నది మంచివాడి భార్య.

ఈ లోపల చెడ్డవాడు మంచివాడి పొలానికి వెళ్ళాడు. బిందె తవ్విన చోటు కనిపిస్తూనే ఉన్నది. పై మట్టి తొలగించ గానే బిందె కనబడింది. వాడు ఆత్రంగా ఆ బిందెను పైకి తీసి, మూత తెరిచి, చూశాడు. అతనికి బిందెలోపల కాసులూ, మొహరీలూ కనిపించటానికి బదులు పాములు మెలితిరుగుతూ కనిపించాయి.

చెడ్డవాడికి చెప్పరాని కోపం వచ్చింది. ''దొంగవెధవ. ఎంత మోసం చేశాడూ! ఇందుకు వాడికి తగిన ప్రాయశ్చిత్తం చెయ్యక మానను!'' అనుకుని చెడ్డవాడు బిందెను ఇంటికి పట్టుకుపోయాడు.

ఆ రాత్రి చెడ్డవాడు ఆ బిందెతో సహా మంచివాడి ఇంటికి వచ్చి, నిచ్చెన వేసి ఇంటి కప్పు ఎక్కి, దానిలో నుంచి లోపలికి చూశాడు. చలిమంటకు వీపు పెట్టి మంచి వాడు పడుకుని ఉండటం చెడ్డవాడికి కనిపించింది. తనకు ఇంత ద్రోహం చేసి, నిశ్చింతగా చలి కాచుకుంటున్న మంచి వాణ్ణి చూస్తే చెడ్డవాడికి మరింత కోపం వచ్చింది. అతను బిందె మీది మూత తీసి, దానిని పొగగూడులో నుంచి లోపలికి పెట్టి, కుమ్మరించాడు.

కాని చెడ్డవాడు అనుకున్నట్టు పాములు పడటానికి బదులు, బంగారు కాసులూ, మొహరీలూ మంచివాడి చుట్టూ పడ్డాయి. అతను ఆనందంతో భార్యను లేపి, "చూశావా, నా కల నిజమయింది. మన అదృష్టం ఆకాశం నుంచి పడింది,'' అన్నాడు.

అటు తరవాత మంచివాడు దారిద్ర్య మన్నది ఎరగకుండా సుఖంగా జీవించాడు.





# నౌకరు యుక్తి

ఒక ఊళ్ళో ఒక సామాన్యపు రైతు ఉండే వాడు. అతను బ్రహ్మచారి కావటం చేత ఇంటి పని చేసేటందుకొక వంటవాణ్ణి పెట్టుకున్నాడు.

ఒక ఏడు మామిడి పళ్ళకాలం వచ్చింది. రైతు ఏదో పని మీద పోతూ ఉండగా ఒక ఎరిగిన ఆసామి కనిపించి, "చాలా మేలు రకం మామిడిపళ్ళు తెప్పించాను. రెండిస్తాను, పట్టుకు వెళ్ళి ఎంత బాగుంటాయో తిని చూడు," అంటూ రెండు పళ్ళు చేతిలో పెట్టాడు. ఆయన ఇంటికి తిరిగి వచ్చి ఆ మామిడిపళ్ళను తన వంటవాడి కిచ్చి, "వీటిని కడిగి, ముక్కలు తరిగి ఉంచు. నే నిప్పుడే వస్తాను," అంటూ తన పని మీద వెళ్ళాడు.

వంటవాడు ఆ మామిడి పళ్ళను కడిగి, చెక్కు తీసి, ముక్కలు తరుగుతూ, ఎలా ఉంటుందో రుచి చూద్దామని ఒక ముక్క నోట వేసుకున్నాడు. రుచి వర్ణనాతీతంగా ఉంది. తరిగేసిన మామిడి కాయలో రెండు ముక్కలు తరుగైతే ఎవరు కనుక్కో వచ్చారు లెమ్మనుకుని మరి రెండు ముక్కలు నోట వేసుకున్నాడు. తింటున్న కొద్దీ మామిడి ముక్కల రుచి హెచ్చుతున్నట్టు కనపడింది. రెండు కాయలూ ముక్కలు తరిగే లోపుగా ముక్కల్లో సగానికి పైగా వంటవాడి కడుపులోకి వెళ్ళిపోయాయి. మిగిలిన ముక్కలను చూస్తే వంటవాడికి భయమయింది.

ఏం చెయ్యాలి? తరిగిన ముక్కల్లో కొన్ని తిన్నానంటే యజమాని కది క్షమించరాని తప్పవుతుంది. కనక ఏదో ఒక బొంకు బొంకక తప్పదు. చిన్న బొంకు కన్న పెద్దబొంకు తేలిక. రెండు మామిడి పళ్ళూ పోయాయని చెప్పటం సులువు. ఆ మాటే చెబుదామనే ఉద్దే



శంతో వంటవాడు మిగిలిన ముక్కలన్నీ తినేసి, తొక్కలూ, టెంకలూ ఎవరికీ కనిపించని చోట పారేసి, పళ్ళెమూ అదీ కడిగి యజమాని కోసం ఎదురు చూస్తూ కూచున్నాడు.

ఈలోపల రైతు తన పని చూసుకుని ఇంటికి తిరిగి వస్తుండగా ఎవరో సాధువు ఎదురయాడు. ఆ సాధువును చూడగానే తనకు దొరికిన మామిడి పళ్ళలో కొంత ఆయనకు పెట్టి ఇంత పుణ్యం సంపాదించు కుందా మనిపించింది రైతుకు. అందుచేత ఆయన సాధువును పలకరించి, దూరప్రాంతం వాడని తెలుసుకుని, ''స్వామీ, మా ఇల్లు ఈ దాపులనే వున్నది, దయచెయ్యండి. పది నిమిషాలు కన్న మిమ్మల్ని ఉంచను,'' అన్నాడు.

సాధువు సరేనని రైతు వెంట వచ్చాడు. రైతు ఆయనని ఇంటి ముందు వసారాలో కూచోమని, లోపలికి వెళ్ళి వంటవాడితో, ''సాధువును తీసుకొచ్చాను. మామిడిపళ్ళు కోసి సిద్ధంగా ఉంచావా? ఆయనకు కాసిని ముక్కలు పెడదాం,'' అన్నాడు.

''ఏం పెట్టి కొయ్యను? కత్తి వట్టి మొద్దుకత్తి,'' అంటూ వంటవాడు ఒక బండకత్తిని, యజమానికి చూపించాడు.

''అలాగా! దీనికి పదును పెట్టి ఇప్పుడే తెస్తానుండు. ఇంటికి పట్టుకొచ్చిన సాధువును వట్టి చేతులతో ఎలా పంపెయ్యటం?" అంటూ రైతు దొడ్లోకి వెళ్ళి, అక్కడ ఒక రాయిపై ఆ మొండి కత్తిని సానపట్ట నారంభించాడు.

ఈ లోపల వంటవాడు వసారాలోకి వచ్చి సాధువుతో రహస్యంగా, ''ఈయనకు మీరెలా దొరికారు, స్వామీ? ఈయన సంగతి తెలీదా?'' అని అడిగాడు.

''నాకెలా తెలుస్తుంది? నేనీ వూరికే కొత్తవాణ్ణి. మీ యజమానిని ఇంతకుపూర్వం చూడనన్నా లేదు,'' అన్నాడు సాధువు.

''చూడండీ, ఈయన శక్తి పూజ చేస్తాడు. మీలాటి సాధువులు కనిపిస్తే ఇంటికి పిలిచి, రెండు చెవులూ కోసి

నైవేద్యం పెడతాడు. ఇలా చాలా మందిని చేశాడు. అదుగో, ఆ చప్పుడు వినండి. దొడ్లో కత్తికి పదును పెడుతున్నాడు. చెవులు కోసేటప్పుడు మీ వంటి వారికి అటే బాధ కలగరాదని ఆయన ఉద్దేశం!'' అన్నాడు వంటవాడు.

ఈ మాట విన్నాక సాధువు వెంటనే లేచి బయలుదేరాడు.

కొంత సేపటికి రైతు కత్తితో లోపలికి వచ్చి వంటవాణ్ణి చూసి, ''ఇదుగో, కాస్త పదును పెట్టాను. వేగిరం పళ్ళు కోసెయ్యి. పాపం, సాధువు చాలా సేపుగా వేచి ఉన్నాడు,'' అన్నాడు.

''ఇంకెక్కడి పళ్ళు? ఇంకెక్కడి సాధువు? మీరలా దొడ్లోకి వెళ్ళారో లేదో ఆయన లోపలికి వచ్చి, రెండు పళ్ళూ తీసి జోలెలో వేసుకుని ఉడాయించేశాడు,'' అన్నాడు వంటవాడు.

''రెండు పళ్ళూ తీసుకున్నాడా? ఒకటైనా ఉంచమనక పోయావా? రుచి అయినా చూసేవాళ్ళం!'' అన్నాడు రైతు.

''నేను పిలుస్తుంటే వినిపించుకోకుండా పరిగెత్తాడు,'' అన్నాడు వంటవాడు.

రైతు చేతిలో కత్తి అలాగే పట్టుకుని వీధిన పడ్డాడు. కొంత దూరం పరిగెత్తాక సాధువు అంత దూరాన కనపడ్డాడు.

''స్వామీ, ఒక్క క్షణం ఆగండి!'' అంటూ రైతు కత్తి పట్టుకున్న చెయ్యి ఎత్తి ఊపాడు. సాధువు వెనక్కు తిరిగి చూసేసరికి గుండె జారిపోయింది. ఆయన వేగంగా పరిగెత్తసాగాడు.

''స్వామీ, రెండూ వద్దు. కనీసం ఒక్కటి ఇవ్వండి చాలు! ఒక్కటైనా ఇవ్వండి,'' అని రైతు గట్టిగా కేకవేశాడు.

ఈ మాటలతో సాధువుకు మరింత భయమైపోయింది. ఈ దుర్మార్గుడు తనను ఒక్క చెవి అయినా ఇచ్చి పొమ్మంటున్నాడనుకుని, ఆ సాధువు శరవేగంతో పరిగెత్తుతూ రైతుకు అందకుండా పారిపోయాడు. రైతు నిరాశచెంది ఇంటికి తిరిగి వచ్చేశాడు. తన యుక్తి పారినందుకు వంటవాడు మటుకు సంతోషించాడు.





# ప్రత్యక్షపాఠం

రామయ్య చిన్న వ్యాపారి. తన గ్రామానికి నాలుగుకోసుల దూరంలో వున్న, ఒక పట్నంలో వారానికి ఒకసారి జరిగే సంతలో, సరుకు కొనుక్కొని వచ్చి, తన గ్రామంలో అమ్ముతూంటాడు. ఒక సంత రోజున అతను డబ్బు తీసుకుని పట్నం బయల్దేరాడు. ఐతే అతను కొంత ఆలస్యంగా బయల్దేరడంతో, పట్నం వెళ్ళే కిరాయిబళ్ళన్నీ వెళ్ళిపోయాయి. ఇక, తను నడిచి వెళ్ళాలి; లేదా ఆ వారానికి సంతకు వెళ్ళడం మానేయాలి.

రామయ్య ఆలోచించి చూశాడు. తను సంతకు వెళ్ళడం మానుకుంటే, వారం రోజులపాటు తన దుకాణంలో సరుకు అమ్మకం వుండదు. తనకు రాబడి తగ్గుతుంది. అందుచేత, నడిచి వెళ్ళడానికే నిశ్చయించుకుని, డబ్బు సంచి నడుం కట్టులో బిగించి బయల్దేరాడు.

కొంతదూరం నడిచాక, రామయ్యకు కాళ్ళు లాగసాగాయి. ఇస్సుమంటూ ఒక చెట్టుకింద చతికిలబడ్డాడు.

కొన్ని నిమిషాలు గడిచాక, రామయ్య ఏనాడూ చూడని కొత్తవాడొకడు అటుగా వచ్చి, అతణ్ణి ఎక్కడికి వెళుతున్నావని అడిగాడు. తను పట్నం సంతలో సరుకు కొనడానికి వెళుతున్నట్టూ, మార్గాయాసం కొద్దీ చెట్టు నీడలో కూర్చున్నట్టూ, రామయ్య చెప్పాడు.

ఆ కొత్తవాడు, నెత్తిపై నున్న పెద్ద మూట నొకదాన్ని దించి, రామయ్య పక్కగా వచ్చి కూర్చుని, అతణ్ణి ఆపాదమస్తకం ఒకసారి పరీక్షగా చూసి, ''నా పేరు గురవయ్య. మనిద్దరం వర్తకులమే. నేను సంతలో సరుకు అమ్మడానికి పోతున్నాను; మీరు కొనడానికిపోతున్నారు, అంతేతేడా!'' అంటూ నవ్వాడు.

ఆర్. రేవతి

ఆ మాటలకు రామయ్య కూడా నవ్వి, "తేడా మాటకొస్తే, మరొకతేడా కూడా వున్నది. నేను వయసు పైబడినవాణ్ణి; నువ్వు యింకా యువకుడివి. నెత్తిన ఏ బరువూ లేకుండానే రెండు కోసుల దూరం నడిచేసరికి, నాకు ఆయాసం వచ్చేసింది. నువ్వు నెత్తిన అంత బరువు తోనూ సునాయాసంగా పోతున్నావు," అన్నాడు.

గురవయ్య ఒక్క క్షణం ఆగి, "ఆ మాట నిజమే! ఈ వయసులో మీరింత శ్రమ పడకుండా, ఆ సంతలో కొనుగోలుకు, మీ గుమాస్తాను పంపవచ్చు కదా," అన్నాడు.



"ఈ పిదపకాలంలో గుమాస్తాలను నమ్మడమా? కట్టుకున్నదాన్నీ, కన్న బిడ్డల్నే నమ్మేందుకు లేదు," అన్నాడు రామయ్య.

"అయితే, మీరెవర్నీ నమ్మరన్న మాట?" అంటూ ఆశ్చర్యపోయాడు గురవయ్య.

"అంతే, నేనెవర్నీ నమ్మను. నమ్మక చెడినవాడూ; నమ్మి బాగుపడ్డవాడూ లోకంలో వుండడు!" అని రామయ్య తన ఛలోక్తికి తానే విరగబడి నవ్వసాగాడు.

"మహ బాగా చెప్పారు! మీ వయసుకు యింత దూరం నడిస్తే, కాళ్ళనొప్పులు రాక ఏమవుతుంది. పెద్దవారు, కాస్త మీ కాళ్ళు పట్టనీయండి," అంటూ గురవయ్య చేతులు చాచాడు.

రామయ్య చప్పున కాళ్ళను వెనక్కు లాక్కుంటూ, "ఏమీ అవసరం లేదు. కాసేపు కూర్చుంటే కాళ్ళనొప్పులు అవే తగ్గుతాయి," అన్నాడు.

"అలా అనకండి. మీరు నాకేం డబ్బివ్వక్కర్లేదు. సాటివర్తకుణ్ణి. అలసట చెందిన పెద్దలకు సేవచెయ్యడం, నాకు ఆనందం, తృప్తి," అంటూ రామయ్య వద్దంటున్నా వినిపించుకోకుండా కాళ్ళు ఒత్తసాగాడు గురవయ్య.

రామయ్యకు తాను సేద తేరుతున్నట్టని పించి, మెదలకుండా వూరుకున్నాడు.

గురవయ్య ఆ మాటా, యీ మాటా చెబుతూ కాళ్ళు తర్వాత, భుజాలూ, తలాపడుతూ—తల, మెడనరాలు సుతారంగా నొక్కి రామయ్యకు స్పృహలేకుండా చేశాడు. తర్వాత అతడి నడుంకట్టులో వున్న సంచి తీసుకుని వెళ్ళిపోయాడు.

కొంతసేపటికి రామయ్యకు స్పృహ వచ్చింది. నడుం తడుముకుని చూసుకున్నాడు. డబ్బు సంచీ లేదు! మతి పోయినవాడల్లే అటూ, యిటూ పరిగెత్తబోయి, దూరంగా ఒక చెట్టు కింద కూర్చుని వున్న గురవయ్యను చూసి, ఒక్క దూకునపోయి, "దుర్మార్గుడా! ఇంతమోసం చేస్తావా! నా డబ్బు సంచీ ఎక్కడ?" అంటూ అతడి మెడ పట్టుకున్నాడు.

"ఆగండి! తొందరపడకండి. ఇదుగో, మీ డబ్బు సంచి," అంటూ గురవయ్య, రామయ్యకు డబ్బు సంచీ యిచ్చేశాడు.

రామయ్య సంచీలోని డబ్బు లెక్క పెట్టి చూసుకున్నాడు. ఉండవలసినదంతా వున్నది. అతడు ఎక్కడలేని ఆశ్చర్యంతో, "ఏమిటిదంతా?" అని ప్రశ్నించాడు గురవయ్యను.

"మరేంలేదు, మీకొక ప్రత్యక్షపాఠం చెప్పదలిచాను. లోకంలో ఎవరినీ నమ్మనన్నారు. కాని, ముక్కూమొహం ఎరగని నన్ను నమ్మేశారు. అవునా?" అన్నాడు గురవయ్య.

రామయ్య అవునంటూ తల వూపాడు. అప్పుడు గురవయ్య తన మూటను నెత్తికెత్తుకుని, "ఇక పోదాం పదండి! బుద్ధిమంతుడైన మనిషి లోకంలో అందర్నీ, దొంగలుగానో, మోసగాళ్ళుగానో అనుమానించకూడదు. గుమస్తాలనూ, ఆత్మబంధువుల్ని కూడా నమ్మనన్న మీరు, ముక్కూమొహం ఎరగని నన్ను నమ్మి, దాదాపు వెంట తెచ్చుకున్న డబ్బంతా పోగొట్టుకున్నంత పని చేశారు," అన్నాడు.

రామయ్య అవునన్నట్టు తల ఊపి, గురవయ్య వెంట పట్నం కేసి నడవసాగాడు.



## విషపుచేప గిరాకీ!



చేపలలో కెల్లా విషపూరితమైనది పఫర్‌ఫిష్. అయినా రుచికారణంగా జపాన్‌లో ఈ చేపలకు గిరాకీ ఎక్కువ. పెద్దపెద్ద హోటళ్ళలో ఈ చేపలోని విషపూరితాలైన భాగాలను తీసివేసి, వంటచేయడానికి ప్రత్యేకమైన వంటగాళ్ళను ఏర్పాటుచేస్తున్నారు. అయినప్పటికీ, జపాన్‌లో ఆహారం విషపూరితం కావడానికి ఈ పఫర్‌ఫిష్ ముఖ్యకారణంగా ఉంటున్నది.

## 30,000 గుడ్లు



తెల్ల చీమలరాణి రోజుకు 30,000 గుడ్లు పెడుతుంది. ఈ లెక్కన అది జీవితకాలంలో దాదాపు యాభై వేల కోట్ల సంతతిని ఉత్పత్తి చేయగలదు.




సహారా ఎడారిలో ఇసుక దిబ్బలు ఒక్కొక్కటి దాదాపు 1,410 అడుగుల ఎత్తూ, మూడు మైళ్ళ పొడవూ కలిగి వుంటాయి!

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1989 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.



Subhash Sabnis



S. Kumar Sharma

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ జనవరి నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి : – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కాదు బరువు

రెండవ ఫోటో : బతుకు తెరువు

పంపినవారు : వక్కలంక కిషోర్, అమలాపురం–533 201, (ఆం. ప్ర)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.



Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

**కొత్త** హార్లిక్స్ బిస్కెట్స్.

# కొంతమంది మంచి రుచి నిపుణులు యిలా అంటున్నారు...













**కొత్త**

## హార్లిక్స్ బిస్కెట్స్

ఇప్పుడు

రుచికరమైనవి, పాలతో నిండినవి, మరియు సంపూర్ణమైన హార్లిక్స్ మంచితనం.

HTA 5456 TEL

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచే మీ పాపాయికి. పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి. సెరిలాక్ లాభాన్ని అందించండి.

పోషకాహార లాభం : సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు. కార్బొహైడ్రేట్లు. కొవ్వు పదార్థాలు. విటమిన్లు. ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

సమయం ఆదా లాభం : సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ. పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

ఎంపిక లాభం : ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీది సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి.సెరిలాక్
పోస్ట్ బాక్స్. నెం 3
న్యూ ఢిల్లీ 110008



Nestlé

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

RK SWAMY/FSL/5112/TEL

